నాయ.—హా! ఎంతక్రూరచిత్తుఁడు గరుత్మంతుఁడు! వినను;

చ. కనుఁగవ బాష్పధార లొలు
కన్ గడు నేడిచి మూర్ఛబొంది మే
ల్కని "యయొ! పుత్త్రకా! యెవరు
గాతురురా" యని దిక్కుదిక్కునున్
గని పలవించుతల్లి యెదఁ
గ్రాలెడుబాలు హరించి మేయుతా
ర్క్ష్యునిహృదయంబు వజ్రమున
రూఢిగ నిర్మితమయ్యెఁ జూడఁగాన్. ౫౩

శంఖ.—(కన్నీళ్ళను తుడుచుకొనుచు) అమ్మా, ఏల యీ యతివైక్లబ్యము? అమ్మా, సమాశ్వసిల్లుము.

వృద్ధ.—(కన్నీళ్లతో) ఏలాగు సమాశ్వసిల్లుదును? ఏమి? ఏక పుత్రుడవని కనికరంగలవాడై నాగరాజు పంపెనా నిన్ను? హా? కోటానకోట్లుప్రాణులుండగా నాపుత్రకుడే జ్ఞప్తికిరావలెనా? అన్నివిధాలను నేనే దౌర్భాగ్యురాలిని.

[మూర్ఛపోవును.

నాయ.—(కరుణతో)

క. దీనున్ శరణవిహీనుం
బ్రాణాపాయప్రసక్తుఁ బంధుత్యక్తున్
వీనిం గావనయేనిన్
మేనివలన నాకు నేమి మేలు ఘటిల్లెన్. ౫౪

దగ్గఱకు పోయెదను.

శంఖ.—అమ్మా, ధైర్యము తెచ్చుకో,

వృద్ధ.—హా! కుమార, నాగలోకరక్షకుడైన వాసుకే నిన్ను వదలి వేసినాడు గదా, ఇక నిన్ను రక్షించేవా రెవరు?

నాయ.—(దగ్గఱకు పోయి) నేను గదా.

వృద్ధ.—(నాయకుని చూచి సంభ్రమమున ఉత్తరీయ ముతో పుత్త్రుని కప్పివేసి, నాయకునియొద్దకు వచ్చి, మోఁకాళ్ల మీఁద నిలిచి) వినతానందనా, నన్ను చంపు, నన్నే నీకు ఆహా రార్థం నాగరాజు పంపినాడు.

నాయ.—(కన్నీళ్లతో) అహో! పుత్త్రవాత్సల్యము!

ఆ. పుత్త్రశోకమునను బొరలాడునీతల్లిఁ
గాంచె నేని, యెంతకఠినుఁ డైన,
నాగభోజియైన, నాగరత్నంతుని
తలఁపు గూడఁగరుణఁ దాల్చుఁజూవె. ౫౫

శంఖ.—అమ్మా, భయపడకు, నాగశత్రువు కాఁడు, చూడు.

భుజంగప్రయా. మహాహీంద్ర మస్తిష్క మాథోల్బణాసృగ్
బృహత్త్రోటి తీక్ష్ణుండహిద్వేషి యేడఁ!
మహాశాంతియుఁ జాలి మల్లాడుమోముఁ!
సహం బొప్పు నీశుద్ధసత్త్వాత్ముఁ డేడఁ! ౫౬

వృద్ధ.—నీమరణానికి భయపడుతూఉన్న నాకు లోక మంతా గరుడమయంగానే అవుపడుతున్నది.

నాయ.—అమ్మా, మాటచే నేమి ప్రయోజనము? ఇదిగో పనిచేతనే రక్షించెద.

వృద్ధ.—(శిరమున అంజలి చేర్చి) పుత్రకా, చిరకాలం బ్రతుకు.

నాయ.—

ఆ. తల్లి, వధ్యగుర్తు దయసేయుమా నాకు,
దానిఁ దాల్చి పోయి యేసునీదు
ననుఁగుఁబుత్త్రుఁగాతు, నతనికిమాఱుగాఁ
దార్క్ష్యుఁ డారగింపఁదన్నొసంగి. ౫౨

వృద్ధ.—(చెవులు మూసికొని) ఆలాగు అక్కఱలేదు. ఈయమంగళం తప్పిపోనుగాక. నీవు కూడ శంఖచూడునికన్న వేఱుగావు. శంఖచూడునికంటే నీవే అధికుడవు, ఎందుచేతనంటే బంధువులుకూడా వదిలివేసిన నాకుమారుణ్ణి నీశరీర మిచ్చి రక్షించగోరుతున్నావు.

శంఖ.—అహో! లోకవిపరీతము ఈమహానుభావుని మనస్సు! ఎట్లన.—

(ఇందిరావిలాసవృత్తము.)

మాలవలెఁ గౌశికుఁడు మాన కెందులకై
శ్వమాంసము న్మును మెక్కినాఁడో,
నాలి యయి గౌతముఁడు నమ్మి రా నుపకర్త
నాడిజంఘునిఁ జంపినాఁడో,

వేళ మిగుల క్షణము వేవ కీగరుడుండు
వేగ పాములఁ జంపువాఁడో,
హాళి నలప్రాణముల నట్టె పిల్లలు లీ
మహాత్ముఁ డన్యుల కిచ్చు నౌరా! ౫౮

(నాయకు నుద్దేశించి) ఓమహాసత్త్వుఁడా, నీస్వశరీరదాన ప్రయత్నముచేతనే నాయందలి కరుణ ప్రకటమైనది. కనుక యీనిర్బంధము మానుము, చూడు:

క. మావంటిక్షుద్రజంతువు
లేవలనం బుట్ట రెండ తెట నీల్గ రయా?
నీవలె నీగతి నొరులం
గావఁగ ధృతదీక్షుఁ లెచట గలుగుదురు ధరన్? ౫౯

నాయ.—శంఖచూడ, నాకు చిరకాంక్షితమై చిరకాలమునకు దొరకిన యీ పరార్థసంపాదనావసరమునకు విఘ్నము చేయుట నీకు న్యాయముగాదు. కనుక ఈవికల్పములు మాని వధ్యచిహ్నమును ఇచ్చివేయుము.

శంఖ.—ఓమహాసత్త్వా, ఈప్రయాసము నిష్ఫలము? శంఖమువలె తెల్లనైన శంఖపాలకులమును శంఖచూడుఁడు నలుపుచేయఁడుసుమా, నీకు నాయందు దయగలదేని, నా విపత్తుచే బెంబేలుపడునీమె ఎట్లు ప్రాణము వదలకుండునో ఆ యుపాయమును ఆలోచింపుము.

నాయ.—ఇక్కడ ఆలోచన కేమున్నది?

ఆ. నీవు చత్తు వేని నిజముగాఁ దాఁ జచ్చు,
నీవు బ్రదుకు దేని నెమ్మిఁ బ్రదుకు,
నట్టియమ్మబ్రదుక నాస గొందువయేని
నిన్నుఁ గాచికొనుము న న్నొసంగి. ౬౦

ఇదే యుపాయము. కనుక త్వరగా వధ్యచిహ్నమును ఇచ్చివేయుము. త్వరగా దానిని ధరించి వధ్యశిలను ఎక్కుదును గాక. నీవును అమ్మనుతీసికొని నీకు హితముగాని యీప్రదేశము నుండి పొమ్ము. ఒకవేళ చెంత నున్న యీ ఘాతస్థానమును జూచి, అమ్మ స్త్రీస్వభావసులభమయిన భయముచేత ప్రాణము వదలినను వదలును. నీవు చూడవా యేమి చచ్చినపాముల కంకాళములచే భయంకరమైన యీ మహాశ్మశానమును ? అట్లేగదా.

స్రగ్ధ. ప్రాంచద్వ్యాబద్ధపక్షద్వయ విధుతిమహా
ధ్వాంతకృద్గృధ్రసంస
చ్చంచూపుట్యగ్రకృత్తశ్లథ పిశితలవా
స్వాదసంవృద్ధగర్ధా
పంచాస్యోద్వాంతశావప్రతతి పతనని
ర్వాణశబ్దాయమానా
చంచత్ప్రేతానలాసృఙ్ముఖరజమువోలయు
న్వాసరుద్గంధమిందున్.

శంఖ.—ఎట్లు చూడ కుందును ?

తే. అహరహంబు నహిచ్ఛటాహారమునను
జేయుచు మహాముదంబు వినాయకునకుఁ,
జంద్రధవళకపాలాస్థి సాంద్ర మయ్యు,
శర్వదేహంబువలె, నీశ్మశానమమరు. ౬౨

కావున త్వరగా పో; ఏల బెదరు పెట్టెదవు? గరుడుఁడు వచ్చువేళ ఆసన్న మయినది సుమా. (తల్లియెదుట మోఁకాళ్ల మీఁద నిలిచి) అమ్మా నీవుకూడ ఇఁకను మరలిపో.

క. ఓయమ్మా యింకను నే
నేయేగతియందు జన్మ మెత్తంగలనో
యాయాగతిఁ బ్రియసుత నీ
వే యమ్మవు గమ్మ యీశ్వరేచ్ఛను నాకున్. ౬౩

[పాదములయందు పడును.

వృద్ధ.—(బాష్పములతో) నాయనా, ఇదే చివరపలుకా? నిన్నువదలి అవతలికి అడుగుపెట్టను నాకు కాళ్లాడవురా; ఇక్కడనే నీతోకూడానే ఉంటాను.

శంఖ.—(లేచి) పరుగునఁ బోయి నేనును ఈచెంగటి దక్షిణగోకర్ణేశ్వరుని ప్రదక్షిణముచేసి వచ్చి రాజాజ్ఞను నెఱవేర్చెదను.

[ఇద్దరును నిష్క్రమింతురు.

నాయ.—(చూచి హర్షముతో) బళి, సిద్ధించినది నా కోరిక, తలఁపని తలంపుగా వచ్చిన యీరక్తవస్త్రయుగ్మము చేత.

కంచుకి.—(ప్రవేశించి) ఈ వస్త్రయుగ్మమును మిత్రావసువుతల్లి దేవిగారు కుమారునికి పంపినారు. దీనిని కుమారుఁడు ధరించును గాక.

నాయ.—(ఆదరముతో) ఇమ్ము. [కంచుకి ఇచ్చును.

నాయ.—(పుచ్చుకొని, ఆత్మగతము) మలయవతివివాహము నాకు సఫలమైనది. (ప్రకాశముగా) కంచుకీ, పో, దేవికి నా నమస్కారమును మనవిచేయుము.

కంచుకి.—కుమారునియాజ్ఞ. [నిష్క్రమించును.

నాయ.—

తే. రక్తవస్త్రద్వయం బిదే రమణ మీఱు
సమయమున కిటు లేతెంచి యమితముదము
నొసఁగుచున్నది మిగులఁ బరోపకృతికి
దేహమును వే సమర్పింపఁ దివురునాకు. ౭౮

(దిక్కులుచూచి) మలయపర్వతంపు గుండ్లను దొరలించుచు ఈప్రచండవాయువు రేఁగుటచూడగాఁ పక్షిరాజు దగ్గఱకువచ్చినాఁ డని తోఁచుచున్నది. సరియేగదా.

మ. స్ర. ప్రళయాభ్రాభంబులై యభ్రముఁ బొదివె నవే
పక్షతిప్రాంతపంక్తుల్,
జలరాశ్యంభంబులై రంహఃశ్వసనమునకు భూ
తూళనం బాచరించెన్,
గలగుండై కల్పభీ దిక్కరులు వణఁకుచు
న్గన్గొన ద్ధ్వాదశాద్రి

త్యాలసత్పత్రద్యుతి న్నిగ్గళక మెఱఁగె సం
ధ్యాపయోదాళియోనాఁ. ౬౫

కనుక ఈ శంఖచూడుఁడు రాకముందే అతిత్వరగా ఈ వధ్యశిలను ఎక్కెదను. (అట్లు చేసి కూర్చుండి స్పర్శసుఖమును నటించుచు) ఆహా! ఏమి దీనిస్పర్శ!

తే. మలయచందనచర్చార్ద్రి మలయవతియు
నిష్టఫలసిద్ధికొఱకు నాశ్లిష్ట యగుచు
నీరుచిరవధ్యశిల యిచ్చునింపులో శ
తాంశమేనియు నాకు నీదయ్యె నహహ! ౬౬

మలయవతిమాట కేమి?

ఆ. జనని యూరువునను శైశవమున హాయి
గాఁ బరున్ననాఁడుఁ గలుగ దయ్యె
వాసి కెక్కునిపుడువధ్యశిలోత్సంగ
మునఁ బరున్ననాకు మొనయు సుఖము. ౬౭

ఓహో! వీఁడుగో గరుత్మంతుఁడు రానే వచ్చినాఁడు ఒడలెల్ల కప్పుకొనియెద. [అట్లు చేయును.

[అంతట గరుడుఁడు ప్రవేశించును.]

గరుడుఁడు.—

స్రగ్ధ. తారాప్రాణేశమూర్తి న్దరిసి తలఁచి మ
త్రస్తుఁ జక్రస్థు శేషుఁ,
దేరి న్భీ ద్రొబ్బ వాజు ల్దినమణి యులుక
న్ధలప్తి న న్న న్న సూదుఁ,

దూరాభ్రంబు ల్గరుత్పంక్తులకుఁ దగిలి త
ద్భూరిదైర్ఘ్యశ్రీంబు వెంపఁగ,
బౌరంజఁగ జందనాద్రిఁగ బడసితి ఫణాభృ
ద్భతక్షణేచ్ఛఁగ క్షణానఁగ.

నాయ.—(పరితోషముతో)

క. ఏపుణ్యము నార్జించితి
నో పాముసు గావ దేహ మొసఁగి యిపుడు నే
నా పుణ్యమునఁ బ్రతిజనిం
బ్రాపించుత దేహ మిటు పరార్థమె నాకుఁగ. ౧౯

గరుడుఁడు.—(నాయకుని చూచి)

శా. ఈవధ్యాశ్మముపై స్వరక్షణపరా
హీంద్రాజ్ఞచేఁ బాతితుఁగ
నావజ్రోపమచంచులఁగ డొలిచి హృ
న్మాంసాస్రముల్ మెక్కనుఁగ
ద్రావఁగ వీని హరింతు వే యరుణవ
స్త్రప్రావృతుఁగ నుద్భయ
ప్రావిర్భావవిదీర్యమాణహృదయా
స్రవ్యాప్తకల్పున్ ఫణిన్. ౨౦

[దభాలున పైఁబడి నాయకుని పట్టుకొనును, తెరలో నుండి పువ్వులు రాలును, దుందుభులు మ్రోఁగును.

గరుడుఁడు.—(ఆశ్చర్యముతో) ఏమి ఇది!

స్రగ్ధ. ఆమోదాకృష్టభృంగంబయి కురిసెడు నే
లా యిదే పుష్పవర్షం ?
క్షేమా దిక్చక్రవాళం బిడియ దివి ధ్వమా
యించు భేరీరవంబుల్ ?

(నవ్వి) ఆ! తెలిసినది! తెలిసినది!

ఆమందారంబును స్నాహాళహాళిఁ బవన
వ్యాప్తి కూటాడిపోయెఁ;
భూమ న్సంవర్తకాభ్రంబులు నుఱిమెడు ను
ద్భూత సంహారశంకన్. ౭౧

నాయ.—(ఆత్మగతము) బళీ కృతార్థుఁడనైతిని!

గరుడుఁడు.—(నాయకుని చూచుచు,)

ఆ. నాగరక్షకుండు నావ్రాల నీరీతిఁ
వఱలుచుంట నధికవశ్యవృత్తి,
సందియంబు లేదు చయ్యన నీవేళ
సర్వభోజనేచ్ఛ సమయు నాకు. ౭౨

వీనిని కొనిపోయి మలయపర్వతశిఖరముమీఁద యథేష్టముగా ఆహారించెదను.

[అందఱును నిష్క్రమింతురు.

---

## పంచమాంకము

[అంతట ప్రతీహారుఁడు ప్రవేశించును.]

ప్రతీ.—

తే. తనగృహారామమున లెస్స తనరుచున్న
ననుఁగు కానిఁకొలఁకుఁ జెల్మి నడలు వొడము;
దారుణాపాయఘోరకాంతారనాభి
నుండెనేఁ దల్లడిల్లక యున్నె మనము ? 23

అట్లే జీమూతవాహనుఁడు సముద్రపుఁబోటును చూడఁ గుతూహలముగలవాఁడై పోయి ఇంక రాలేదని మహారాజ విశ్వావసువు దిగులుపడుచున్నాఁడు. న న్నిట్లాజ్ఞాపించినాఁడు:— ఏమనఁగా:—“సునందా, గరుడుఁడు వచ్చునట్టి యా భయంకరస్థానమునకు అల్లుఁడు జీమూతవాహనుఁడు పోయియున్నాఁడఁట, అందువలన దిగులుగానున్నది. కనుక త్వరితముగా తెలిసికొనిరా అతఁడు వచ్చినాఁడో రాలేదో.” అని అక్కడికే పోయెదను. (పరిక్రమించుచు ఎదుట చూచి) వీఁడుగో జీమూతవాహునితండ్రి రాజర్షి జీమూతకేతువు పర్ణశాలముంగిట ధర్మపత్ని చేతను రాజపుత్త్రిచేతను శుశ్రూషవొందుచు కూర్చున్నాఁడు. అట్లే,

ఉ. ఫేననిభంబు భంగితము
వీచిచలం బగుక్షౌమయుగ్మముఁ

బూని యితండు వార్ధియొఱ
పుం బురణించు, సుతోయమైన గం
గానది వోలెఁ బుణ్యవతి
గాదిలిదేవియు వెంటఁ గొల్వ, వే
లానిభ యైా కులంగటను
లాలిత కోడలు నుల్లసిల్లఁగాన్. ౭౪

దగ్గఱకు పోయెదను.

[అంతట భార్యతోను కోడలితోను జీమూతకేతువు ప్రవేశించును]

జీమూ.—

ఉ. భుక్తము లయ్యె యావనపు
భోగము, లేలితిఁ గీర్తి యొప్పఁగా
దిక్తతి, నేకవృత్తిఁ గడ
తేఱెఁ దపంబు, సుతుండు శ్లాఘ్యుఁడున్
దవ్యక్తరజస్తముండు, సదృ
శాన్వయసంభవ కోడ లీమెయున్,
వ్యక్తముగాఁగ నే నిఁకఁ గృ
తార్థత మృత్యువుఁ గోరఁగాఁ దగున్. ౭౫

సునం.—(తటాలున దగ్గఱకువచ్చి) జీమూతవాహనుని యొక్క.

జీమూ.—(చెవులుమూసికొని) శాంతము పాపము.

వృద్ధ.—ప్రతిహత మీయమంగళం.

మలయ:—అదురుతూఉన్నది నాహృదయం ఈ దుశ్శకునంచేత.

జీమూ.—(ఎడమకన్నదరుటను సూచించి) భద్రా, ఏమి జీమూతవాహానుని యొక్క ?

సునం.—జీమూతవాహానుని యొక్క వార్తను తెలిసికొని రమ్మని మహారాజ విశ్వావసువు నన్ను మీయొద్దకు పంపించినారు.

జీమూ.—ఏమీ ? మాఅబ్బాయి అక్కడ లేఁడా ?

వృద్ధ.—(విషాదముతో) మహారాజా, అక్కడ లేక పోతే నాకొమారుడు మరెక్కడికి వెళ్లి ఉంటాడు ?

జీమూ.—నిశ్చయముగా మనప్రాణయాత్రకై దవ్వు పోయియుండును.

మలయ.—(విషాదముతో, ఆత్మగతము,) నాకు మఱి ఆర్యపుత్రుణ్ణి గురించి ఏమేమో తోస్తూ ఉన్నది.

సునం.—ఆజ్ఞాపింపుఁడు, స్వామికి నేను ఏమి మనవి చేయుదును?

జీమూ.—(ఎడమకన్నదరుటను సూచించి) జీమూతవాహానుఁడు ఆలస్యము చేయుచున్నాఁడని నాహృదయములో మిక్కిలి దిగులుగానున్నది.

క. మితిలే కదరెద వేలా
వెతఁ దెలుపు చదక్షిణాక్షి విసుభక నాకుఁ ?

హతనేత్రము, నీత్రుళ్లను
హతమార్చును వీఁడుగో నహస్కరుఁడిపుడే. ౭౬

(ఊర్ధ్వము చూచి) మూఁడులోకములకు ఏకనేత్రమయిన యీ వేయి కిరణముల భగవంతుఁడు స్పష్టముగా జీమూతవాహనునికి క్షేమము కలుగఁజేయును. (చూచి ఆశ్చర్యముతో)

శా. ఏమో! హా! యిది మింటఁ బాసి దిగుచుఞ్
హింసించు నాకన్నులఞ్,
స్తోమంబౌతనవెల్గులో యనఁగ నె
త్రుల్ ధారగాఁ గారఁగాఁ
నామ్రోలం బడెడిఞ్ దహించుచు వెసఞ్
నాడెంద మాత్మాప్తితో
ద్దామాడంబర వాత ధూత నిపత
త్తా రాకృతిం బేర్చుచుఞ్. ౭౭

ఏమి! నాపాదములలోనే పడినది! [అందఱు చూతురు.

జీమూ.—ఏమి ఇది! తడిమాంసముతోడిచూడామణి. ఇది ఎవరిదై యుండును?

వృద్ధ.—(విషాదముతో) మహారాజ. మనపిల్లవానిదానిలాగే ఉన్నది ఈ చూడారత్నం.

మలయ.—అత్తా, అలాగు అనకండి.

సునం.—మహారాజ, కారణ మెఱుఁగక ఇట్లు అధైర్యపడ నేల? ఇక్కడ నాగాధిపతులను భక్షించుచు గరుడి పెఱికి వేయు శిరోమణులు ఇట్లు పడుచుండును.

జీమూ.—దేవి! యుక్తియుక్తముగా చెప్పినాఁడు. ఒక వేళ ఇదియును అట్టిదే కావచ్చును.

వృద్ధ.—సునందా, ఈవేళకు మా అబ్బాయి మామ గారియింటికే వచ్చియుంటాఁడు. త్వరగా వెళ్లి తెలుసుకొనిరా.

సునం.—దేవియాజ్ఞ. [నిష్క్రమించును.

జీమూ.—దేవి, ఇది నాగచూడమణియే అగునా?

[అంతట రక్తవస్త్రములు ధరించి శంఖచూడుఁడు ప్రవేశించును.]

శంఖ.—(కన్నీళ్లతో)

తే. అర్ణవతటంబునందు గోకర్ణు మ్రొక్కి
పరుగునైపోఁ జేరితి భుజంగ వధ్యభూమి;
నింతలోనయ్యయో! చంచుహింసితోరు
నహిభుజుండుహరించె విద్యాధరేంద్రు. ౭౮

(ఏడ్చుచు) హా! మహాసత్త్వ హా! పరమకారుణిక! హా! నిష్కారణైకబాంధవ! హా! పరదుఃఖదుఃఖిత! ఎక్కడికి పోయితివి? నామాటకు బదులు చెప్పవు! హా! శంఖచూడ హతక! ఎంతపని చేసితివిరా!

తే. అహిభరణకీర్తి యొకపూట యైన లేదు
శ్లాఘ్యముగ జేసియానతిసలుపనైతి
నేల నాబ్రదుకోరుఁడు నాకిచ్చెఁబ్రాణ
మయ్యయో! ఛీ! చెడితిని! నేనయ్యొ! చెడితి! ౭౯

కనుక నేను ఇట్టిబ్రదుకు క్షణమైనను బ్రతికి పరిహాసాస్పదము కాను. ఇతనితో కూడ పోవుటకు యత్నించెదను. (పరిక్రమించి నేలను చూపు నిలిపి)

మ.స్ర. సురుచిస్మ న్మ్యాఖరిపాత, న్నవిరళపతిత
స్థూలగోళ న్నిభుుందం,
బెరరేపారాల శీర్ణామితతనుకణికల్,
మెట్టెలల్ గిటకీర్ణల్,
దరలక్ష్య ధ్ధాతుల, న్సాంద్రతరుశిఖల సం
స్త్యానసీలస్వరూపల్,
గరుడుం గానంగ నీరక్తసరణి నెఱుక
ల్గాంక్షతో వెంబడింతుల్. శాం

వృద్ధ.—(భయముతో) మహారాజ, వీడెవడో శోకాక్రాంతునిలాగు ఎట్టిని మొగంతో ఇక్కడికే త్వరత్వరగా వస్తున్నాడు: వీణ్ణి చూడఁగా నాహృదయము ఏమో దిగులుమంటూ ఉన్నది. వీడెవరో తెలుసుకోండి.

జీమూ.—దేవి చెప్పినట్లు. (ఆలకించి, హర్షముతో, నవ్వి.) దేవీ, శోకము మానుము. నిజముగా ఇతనిది ఈచూడామణి మాంసలోభముచేత ఏదో పక్షి పెకలించుకొని పోవుచుండఁగా ఇక్కడ పడినది.

వృద్ధ.—(పరితోషముతో మలయవతిని కౌఁగిలించుకొని,) అవిధవా, అధైర్యపడకు. ఈలాగంటియాకారము వైధవ్యదుఃఖానికి పాత్రము కాదు.

మలయ.—అత్తా, మీ ఆశీర్వాదముల ప్రభావంచేత,
[పాదముల వ్రాలును.

జీమూ.—వత్సా! ఏమీ?

శంఖ.—దుఃఖభారముచేత కన్నీళ్లచే కంఠము ఉపరుద్ధమై చెప్పఁజాలకున్నాఁడు.

జీమూ.—

తే. చెప్పవయ్యా కుమార యీచింత మాని;
నామనంబున దుస్సహమై మదీయ
పుత్రశోకంపుదావ ముద్భూత మయ్యె;
దాన నీఁక సహ్యా మానెద్దియేనివత్స. ౮౧

శంఖ.—విందురుగాక.— నే నొకనాగుఁడను, నాపేరు శంఖచూడుఁడు, వాసుకి నన్ను వైనతేయునికి ఆహారముగా పంపినాఁడు. విస్తరమేల? ఒకవేళ ఈనెత్తురుజాడ గాలికి రేఁగు నిసుకచే మాసి అగపడక పోయినను పోవును. కనుక సంగ్రహముగా చెప్పెదను.

క. కరుణాసంపూర్ణాంతః
కరణుండై నాదుప్రాణకంబుల విద్యా
ధరుఁడొకఁడు గాచె గరుడుని
కరుదుగఁ దనదేహ మిచ్చియాహారముగాఁ. ౮౨

జీమూ.—మఱి యెవరు ఇట్టిపరహితపరాయణుఁడు? స్పష్టముగానే చెప్పవోయి, జీమూతవాహనుఁ డని, హా! మునిఁగిపోయితిని మందభాగ్యుఁడను.

వృద్ధ.—హా! పుత్రకా! ఏమి చేసివేసినావు!

మలయ.—అయ్యో! దుశ్శకునం సత్యమే ఆయెనుగదా!

[అందఱును మూర్ఛపోవుదురు.

శంఖ.—(బాష్పముతో) నిశ్చయముగా వీరు ఆమహా సత్త్వుని తల్లిదండ్రులు. అయ్యో! అప్రియము చెప్పి వీరిని ముంచి వేసితిని! కాక, విషధరునినోటినుండి విషము తప్ప మఱేమి వచ్చును? ఆహా! ప్రాణదాతయైన జీమూతవాహనునికి తగినట్లు ప్రత్యుపకారము చేసినాఁడు శంఖచూడుఁడు! ఇంకను ఇప్పుడే ఆత్మహత్య చేసికొందునా! వలదు. వీరిని ఓదార్చెదనుగాక, బాబూ, సమాశ్వసిల్లుము. అమ్మా, సమాశ్వసిల్లుము.

[ఇద్దఱును సమాశ్వసిల్లుదురు.

వృద్ధ.—వత్సా, లేవే, ఏడవకే, మనము జీమూత వాహనుణ్ణి వదిలి బ్రతుకుతామా ఏమి? కనక నిబ్బరపడు.

మలయ.—(సమాశ్వసిల్లి) ఆర్యపుత్రా, నిన్ను నేను ఇక ఎక్కడ చూడవలిసింది?

జీమూ.—హా! వత్సా, గురుచరణశుశ్రూషావిధిజ్ఞ!

క. నాచరణంబులలోనే
యీచూడామణిని వైచి యీ వసయము నీ
యాచారమయినవినయముఁ
బ్రోచితి లోకాంతరంబు పోయియుఁబుత్రా. 3

(చూడామణిని చేత దీసికొని) హా! వత్స, ఏమి ఇంత మాత్రమే అగపడువాఁడవైతివి? (హృదయములో నుంచుకొని) అహాహా!

ఉ. చాలఁగ నమ్రమౌళి వయి
సారె మదంఘ్రుల కీవు భక్తిమై
వ్రాలఁగ నీశిరోమణియ
వంధ్యతఁజేరియు నోహో సంగదే!
బాలకయిప్డు చెంగటను
బట్టినమాత్రన నాదుడెందముస్
జీలుచుఁ గాల్చు నేలొకొ వ
చింపుము హా! పితృమాతృవత్సలా! ౧ర

వృద్ధ.—హా! పుత్ర, జీమూతవాహన! ఏనీకు గురుశుశ్రూష తప్ప వేఱేసుఖం రుచించదో అటువంటి నీవు ఇప్పుడు మీ నాయనను వదిలి స్వర్గసుఖం అనుభవించడానికి ఏలాగు వెళ్లి పోయినావు?

జీమూ.—(కన్నీళ్లతో) దేవి, ఏల ఇట్లు ప్రలపించెదవు? మన మేమి జీమూతవాహనుఁడు లేక జీవించెదమా?

మలయ.—(పాదములయందు పడి చేతులు మొగుడ్చుకొని) అటయితే ఆర్యపుత్రుని చిహ్నమైన యీచూడామణిని నాకు దయచేయండి. దాన్ని హృదయాన ఉంచుకొని అగ్ని ప్రవేశంచేసి హృదయంయొక్క సంతాపాన్ని పోగొట్టుకొంటాను.

జీమూ.—ఓపతివ్రత, ఏల యిట్లు వ్యాకులపడియెదవు, మనకందఱికిని అదేగతి.

వృద్ధ.—మహారాజ, మఱియేల మనం ఆలస్యం చేయడం ?

జీమూ.—ఎందునకును లేదు దేవీ ; అయినను ఆహితాగ్నికి ఇతరాగ్నిచేత సంస్కారము విధింపఁబడలేదు. కనుక అగ్నిహోత్రగృహమునుండి అగ్ని తెచ్చి మనలను దహించుకొందము.

శంఖ.—(ఆత్మగతము) కటకటా ! నాయొక్కనికొఱకు ఈవిద్యాధరకులము సర్వము ఉత్సన్నము కానున్నది ! ఇట్లు చెప్పెదను గాక. (ప్రకాశముగా) బాబూ, వాస్తవమును నిశ్చయింపకయే ఇట్లు సాహసించుట యుక్తము గాదు ; దైవవిలసితములు విచారసహితములు. ఒకవేళ, ఇతఁడు నాగుఁడు గాఁడని తెలిసికొని, నాగశత్రువు విడిచిపెట్టినను విడిచిపెట్టును. కనుక ఈదిక్కుననే గరుత్మంతుని వెదకుదము.

వృద్ధ.—అన్నివిధాల దేవతలప్రసాదంచేత సుజీవుఁడైన పుత్రునిముఖాన్ని చూతము గాక.

మలయ.—(ఆత్మగతము) దుర్లభం సుమా యిది నాకు మంద భాగ్యురాలికి.

జీమూ.—వత్సా, నీవాక్కు సత్యమే యగునుగాక. అయినను అగ్నినికూడ తీసుకొనియే మేము రాఁదగును. నీవు ముందు వెదకుము. మేమును అగ్నిగృహమునుండి అగ్నిని తెచ్చుకొని త్వరగానే నిన్ను కలసికొనెదము.

[భార్యతోను కోడలితోను నిష్క్రమించును.

శంఖ.—.ఇంక గరుడుని వెంబడించెదను. (ఎదుట చూచి)

శా. పాటీరాచలకూటకోటి నదె గ
 న్పట్టున్ ఖగేంద్రుం డసృ
గ్ఘాటాక్తంబగుత్రోటి దీటి దొనలం
 గల్పించుచున్ గ్రొత్తగాఁ
గాటిన్ బూడిగ నేర్వఁగాఁ దనకను
 ల్కాలాగ్నిఁ బోల్చూపులన్
గాటం బై దిగ వజ్రఘోరనఖరా
 గ్రంబుల్ ధరామండలిన్. ౮౫

[అంతట ఆసనస్థుఁడై గరుడుఁడును, అతనిముందఱ
వెదకి లంబడి నాయకుఁడును, ప్రవేశింతురు.]

గరుడుఁడు—(ఆత్మగతము) నాజన్మము మొదలు నేను నానాభుజంగపతులను భుజించుచుంటిని గాని ఇట్టియద్భుతము నెన్నఁడును చూచియెఱుఁగను. ఏమనఁగా, ఈమహాత్ముఁడు బాధపడమి మాత్రమే గాక ఏమో ఆనందముగ్నుఁడుగా అగపడు చున్నాఁడు. అట్లే:

శా. క్రాలున్ దుష్టియ యెంత త్రాగినను ర
 క్తం బంత, నానామిషా
భీలోత్కర్తనతీవ్రవేదనలకున్
 బ్రీతిప్రసన్నంబు మో,
మాలోకింపని యంగ మేదో యది రో
 మాంచాంకితం బౌను, జూ

పాలోకించు మహోపకారి బలెన
త్యంతాపకారిఁ ననున్. ౨౬

కనుక ఈయనయొక్క యీధైర్యవృత్తిచేత నాకు కుతూహలమే కలుగుచున్నది. కానీ ఇతనిని భక్షింపను అడిగి చూచెదను, ఇతఁ డెవఁడో.

నాయ.—

ఆ. నాడులందు నింక నల్ల లొల్కెడుఁ జూడు
మేన నింక నెఱచి మెసవఁ గలదు
కానరావు తృప్తియైన యట్లు మహాత్మ
బోన మేల గరుడి మానితయ్య. ౨౭

గరుడుడు.—(స్వగతము) ఆశ్చర్య మాశ్చర్యము! ఏమి! ఇట్టి యవస్థలోఁ గూడ ఇట్లు ఊర్జితముగా పలుకుచున్నాఁడు! (ప్రకాశము)

క. నీహృద్రక్తముఁ ద్రోటిఁ
నే హరియించితిని, దాన నే మగు; నీ వీ
నాహృద్రక్తము నీధృతి
చే హరియించినవిధంబు చెలఁగె మహాత్మా. ౨౮

కనుక నీ వెవఁడవో వినఁగోరెదను.

నాయ.—ఇట్లు ఆఁకలిచే బాధపడుచున్న నీవు వినిపింపదగినస్థితిలో లేవు. నారక్తమాంసములచేత తృప్తిచేసికొమ్ము.

శంఖ.—(తొటూలున వచ్చి) తార్క్ష్యా, వదలు వదలు, సాహసము చేయకు. ఇతఁడు నాగుఁడు కాఁడు. ఇతనిని వదలుము.

నన్ను భక్షింపుము. నేను నీకు ఆహారార్థము వాసుకి పంపిన వాఁడను. [బొమ్మను ఇచ్చును.

నాయ.—(శంఖచూడుని చూచి) అయ్యో! నాకోరిక విఫలమాయెను, శంఖచూడుని రాకచేత!

గరుడుఁడు.—(ఇద్దఱిని చూచి) వీరికిద్దఱకును వధ్య చిహ్నముకలదు. ఎవఁడు నాగుఁడో తెలిసికొనఁజాలకున్నాను.

శంఖ.—యుక్తమే యీభ్రాంతి. అయినను,

శా. ఉండుంగాకెద స్వస్తికంబు కుబుసం
బొప్పారదే మేన? రెం
డ్రెండౌ నాల్కల నెన్నవె ల్గెదురనే
నేఁబల్కఁగాఁ? జూడ వె
ట్లుండక్ దీవ్రవిషాగ్ని ధూమపటల
వ్యాజిహ్మరత్నార్చి ను
ద్దండాత్యుత్కటశోకసీత్కృతమరు
ద్వ్యాధక్ ఫణామండలిక్. ౮౫

గరుడుఁడు.—(ఇద్దఱిని చూచి శంఖచూడుని పడగలను చూచి) అట్లయిన నేను భక్షించిన యితఁ డెవరు?

శంఖ.— విద్యాధరవంశతిలకమయిన జీమూతవాహనుఁడు. ఎట్లు అకారుణికుఁడవై యిట్టి యకృత్యము చేసితివి?

గరుడుఁడు.—హా! ఏమిచేసితిని! ఇతఁడు విద్యాధర కుమారుఁడు జీమూతవాహనుఁడా? అతఁడా యితఁడు?

ఉ. మేరువుపై, మహేంద్రతట
మేదిని, మందరకందరాళి, నీ
హారగిరిఁ హరాద్రి, మల
యాద్రిని, దిక్కులవిందు నెల్లెడన్,
వారక యేమహామహుని
వంద్యయశంబును, జక్రవాళసం
చారపరాయణప్రగుణ
చారణమండలి పాడుచుండఁగాన్. ౯౦

సర్వథా మహత్తరమైన పాపపంకమందు మునిఁగిపోయి తిని!

నాయ.—ఓఫణిపతీ, ఏల యిట్లు ఉద్విగ్నుఁడ వయ్యెద ?
శంఖ.—ఏమి? ఇది ఉద్వేగమునకు కారణము గాదా?

క. ఈలీలన్ నీదేహము
వ్యాళారికిఁ బెట్టి నేను బ్రదుకుదు నేనిన్
బోలున్ ద్రోయంగాఁ బా
తాళతలంబునకుఁ గ్రింది తలమునకు నన్. ౯౧

గరుడుఁడు.—ఓహో కరుణార్ద్రచిత్తుఁడై యీమహాను భావుఁడు నాకు భోజనముగా ఏర్పడిన పాముయొక్క ప్రాణములను కాపాడుటకు తనదేహమును ఇచ్చినాఁడు. వేయేల? బోధిసత్త్వనే యితనిని చంపివేసితిని. ఈమహాపాపమునకు అగ్నిప్రవేశము కంటె వేఱేప్రాయశ్చిత్తము అగపడదు! ఇప్పుడు నాకు అగ్ని ఎక్కడ దొరకును? (దిక్కులఁ జూచి) భళీ, వీ రెవరో నిప్పు

తెచ్చుచు ఇటే వచ్చుచున్నారు. సరి, వీరు వచ్చువఱకు ఎదురు చూచెదను.

శంఖ.—కుమార, నీతల్లిదండ్రులు వచ్చినారు.

నాయ —(సంభ్రమముతో) శంఖచూడ, చక్కఁగా కూర్చుండి నాశరీరమును ఉత్తరీయముతో కప్పి నన్ను లేవనెత్తి పట్టుకొమ్మా. అట్లు చేయనియెడల ఈ స్థితిలోనున్న నన్ను తటాలున చూచి అమ్మ ప్రాణము విడిచినను విడుచును.

[శంఖచూడుఁడు ప్రక్కను పడియున్న యుత్తరీయము నెత్తి అట్లే చేయును.]

[అంతట భార్యావధూ సమేతుఁడై జీమూతకేతువు ప్రవేశించును.]

జీమూ.—(కన్నీళ్లతో) హా! పుత్త్ర! జీమూతవాహన!

మ. తనవాఁ డన్యుఁ డటంచు భేదము కృప
న్దథ్యంబుగా లేద; యొ
క్కనినో పెక్కురనో తగు న్మనుప నా
ఘూర్ణింపవే యాత్మలో!
తనివిం బ్రాణము దార్క్ష్యనుండి మనుప
న్దత్తాత్మదేహుండ వై
నినుఁ దల్లి న్సతి భార్యఁ జంపి కులము
న్నిశ్శేషము న్జేసితే. ౯౨

వృద్ధ.—(మలయవతి నుద్దేశించి) వత్సా, రవంతసేపు ఊరుకోవే. ఎడతెంపు లేక పడుతున్న బాష్పధారలచేత అగ్ని ఆరిపోతుంది, [అందఱు పరిక్రమింతురు.

జీమూ.—హా పుత్త్ర, జీమూతవాహన!

గరుడుఁడు.—(విని) 'హా! పుత్త్ర! జీమూతవాహన!' అనుచున్నాఁడు. నిశ్చయము ఇతఁడే ఇతనితండ్రి. ఇతనియగ్నితో నన్ను నేను ఎట్లు దహించుకొందును? పుత్త్రఘాతలజ్జచేత ఇతనికి ముఖము చూపనైనను శక్తుఁడను కాను. కానీ అగ్నికోసము ఇంత విచార మేల? గట్టుననే కదా ఉన్నాను సముద్రమునకు. కనుక ఇప్పుడు:

స్రగ్ధ. కాలాంతాక్రాంతవిశ్వగ్రసనరసలస
త్కాలజిహ్వాకరాళ
జ్వాలావాచాల సప్తాశ్వకబళనవిధా
వర్ధమాన ప్రసర్పత్
వ్యాలోలోత్పాతవాత ప్రసరపటిమము
త్పతత్సంధుక్షితార్చి
ర్జాలంగాఁ బోయెద న్గల్పదహానభయద
న్బాడబాభోగనాభిన్. —3

[అని లేవఁగోరును;

నాయ.—ఓపక్షిరాజా, ఈ ప్రయత్నము చాలింపుము. ఈపాపమునకు ఇదిగాదు ప్రతీకారము.

గరుడుఁడు.—(మోఁకాళ్లమీఁద నిలిచి అంజలి చేర్చి) ఓమహాత్మా, మఱి యేదో చెప్పుము.

నాయ.—ఒకక్షణము ఓపికచేయుము. నా తలిదండ్రులు వచ్చియున్నారు. వీరిని నమస్కరించెదను.

గరుడుండు.—అట్లే చేయుము.

జీమూ.—(చూచి, హర్షముతో,) దేవి, నీపుణ్యము బాగుగానున్నది. వీఁడుగో నాయన జీమూతవాహనుఁడు, కేవలము బ్రదికియుండుటయే కాక, కృతాంజలియైన గరుడునిచే ఉపాసింపఁబడుచున్నాఁడు.

వృద్ధ.—మహారాజ ధన్యురాలినైతిని. అక్షతశరీరుఁడైన కుమారునిముఖము చూతునుగాక.

మలయ.—నేను ఆర్యపుత్రుణ్ణి చూస్తూనే అతిప్రియము గనక నమ్మలేకుండా ఉన్నాను.

జీమూ.—(దగ్గఱకు వచ్చి) వత్సా, రా, రా, నన్ను కౌఁగిలించుకో.

[నాయకుఁడు లేవఁగోరుచు ఉత్తరీయము జాఱి పడి పోయి మూర్ఛిల్లును.

శంఖ.—కుమార, సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

జీమూ.—హా వత్స! ఏల నన్నుచూచి మూర్ఛపోయితివి?

వృద్ధ.—హా నాయనా, మాటమాత్రాననైనా నన్ను ఆదరించవేమి?

మలయ.—హా ఆర్యపుత్ర! గురుజనులనుకూడా నీవు చూడఁగూడదా ఏమి? [అందరును మూర్ఛిల్లుదురు.

శంఖ.—హా శంఖచూడహతక! నీవు ఏలరా కడుపులోనే చావవైతివి? అట్లయిన క్షణక్షణమును ఇట్టి మరణాధిక దుఃఖమును అనుభవింపవుగదరా!

గరుడుఁడు.—ఇది అంతయు ఘాతకుఁడనైన నా యవిమృశ్యకారితయొక్క విజృంభితము. ఇట్లు చేసెదను. (రెక్కలతో విసరుచు) ఓమహాత్మా, సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

నాయ.—(సమాశ్వసిల్లి) శంఖచూడ, గురువులను సమాశ్వాసింపుము.

శంఖ.—బాబూ, సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము. అమ్మా సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము.

[ఇద్దఱును సమాశ్వసిల్లుదురు.

వృద్ధ.—ఏమి నాయనా, మేము చూస్తుండగానేనా నిన్ను యమధర్మరాజ హాతకుడు అపహరిస్తున్నాడు!

జీమూ.—దేవి, ఇట్లు అమంగళవచనములు పలుకకు. చిరంజీవి బ్రదికియే యున్నాఁడు. కోడలిని ఓదార్పుము.

వృద్ధ.—(ముఖమునకు వస్త్రము కప్పుకొని ఏడ్చి) ప్రతిహాతం అమంగళం. ఏడవను. మలయవతీ, సమాశ్వసించు; వత్సా, లేవే. ఈసమయంలో భర్తముఖం చూడు.

మలయ.—(సమాశ్వసించి) హా ఆర్యపుత్ర!

వృద్ధ.—(మలయవతిని నోరుమూసి) వత్సా! ఈలాగు చేయకే, ప్రతిహాతం ఇడ.

జీమూ.—(కన్నీళ్లతో ఆత్మగతము)

ఆ. గాత్రశేష మెల్ల గళిత మాటను గంత
సీమ నిల్పు లేమిఁ జెల్లు ననఁగఁ

బ్రాణ ముత్క్రమించుపట్టిని గాంచియు
బ్రయ్య నేమి వేయివగల వగల! ౯౮

మలయ.—హా ఆర్యపుత్ర! అతి దుష్కరకారిణిని సుమా నేను. ఇట్లున్న యార్యపుత్త్రుని చూచుచునే ఇప్పటికిని ప్రాణములు వదలకున్నాను!

వృద్ధ.—(నాయకుని యవయవములను తడవుచు గరుడుని ఉద్దేశించి) ఓయి నిశ్శంకుడా ఇప్పుడిప్పుడే యౌవనశోభ యెక్కుతున్న నాపుత్త్రకుని యీశరీరాన్ని ఈయవస్థకు తేవడానికి నీకు వేలాగు మనసొప్పింది?

నాయ.—అమ్మా, అట్లు గాదు. ఇతఁ డేమి చేసినాఁడు? ఇంతకుముందు కూడ ఇది పరమార్థముచేత ఇట్టిదే గదా? చూడు.

తే. తోలు మూసిన యస్థి మేదోరసాంత్ర
రక్తసంఘాత మీశరీరంబు; దీన
శోభయు నొకండు గలుగునే చూడఁగా స
దావిభావితబీభత్స దర్శనమున? ౯౯

గరుడుఁడు.—ఓమహాత్మా; నరకాగ్నిజ్వాలావలీఢునిగా నన్ను తలఁచుకొనుచు కష్టముతోనున్నాను. కనుక ఈ పాపము నన్ను ఎట్లు విడుచునో ఉపదేశింపుము.

నాయ.—నాయనా, నాకు ఆజ్ఞయిమ్ము. ఇతనికి పాపమునకు ప్రాయశ్చిత్తము చెప్పెదను.

జీమూ.—వత్సా, మంచిది; అట్లు చేయుము.

నాయ.—వైనతేయుఁడా, వినవోయి.

గరుడుఁడు.—(అంజలి చేసి) ఆజ్ఞాపింపుము.

నాయ.—

ఉ. చేయకు హింస, కుందు మును
జేసినదానికి, నెల్లప్రాణులం
బాయక ప్రోచి పుణ్యపుఁబ్ర
వాహ ముపార్జన సేయు, మందులో
నే యడఁగారి ప్రాక్కృతవ
ఘౌఘము భర్జిత బీజకల్ప మై
యాయతి నాత్మ కార్యకర
ణాక్షమ మౌ నది నుప్పుటావలెన్. ౯౬

గరుడుఁడు.—నీయాజ్ఞ.

క. పాడివినయజ్ఞానం బను
నిదురన్ సంసృతికలన్ మునిఁగి నీకృపకుం
బదమై మేల్కాని లేచితి
వదలితి వదలితిని బ్రాణివధము మహాత్మా. ౯౭

ఇది మొదలుగా,

ఉ. ఒక్కెడ సైకతాయతఫ
ణోచ్ఛ్రితి దీవివలె న్దలిర్పఁగా,
నొక్కెడ భోగచక్రము మ
హోగ్ర జలభ్రమవిభ్రమం బిడన్,

ఒక్కెడ నొడ్డునుండి పెర
యొడ్డున కేఁగుచు సేతురూపమై,
యక్కజఁ గేరుఁగా కపీస
మాజము పేరెలమి న్మహాంబుధిన్. ౯౮

మఱియు,

మ.స్ర. తలకట్టు ల్వీడి యాపాదము పొదువ
ఘనధ్వాంతము న్బోలె, గండ
స్థలము ల్బాలాతపారక్తత వెలుఁగఁగ
నైంద్రంపు లేఁబూఁతఁబోలెన్,
అలసాంగు ల్ద్రోసి సేద న్హారువున మలయ
ప్రాంతపాటీరవాటిన్
బలురక్తి న్నిదుకీర్తి న్ఫణధరయువతు
ల్పాడెడు న్నాతఁ బ్రీతిన్. ౯౯

నాయ.— మేలు మహాసత్త్వుఁడా, మేలు. సంతోషించితిని. అన్నివిధముల దృఢసమాధానుఁడవు గమ్ము. (శంఖచూడుని నిర్దేశించి) శంఖచూడ, నీవు ఇంటికి త్వరగా పొమ్ము.

[శంఖచూడుఁడు నిశ్వసించి అధోముఖుఁడై నిలిచియుండును.

నాయ.—(నిశ్వసించి తల్లిని చూచుచు)

ఆ. నిన్ను గరుడి డొలుచుచున్నరూపము మదిఁ
దలఁచి తలఁచి యమ్మ తాపభరము

సైఁపలేక జోలి చచ్చిన ట్లయియుండు;
నామె దేర్పఁ బోవె యతిరయమున ? ౧౦౦

వృద్ధ.—(కన్నీళ్లతో) ధన్యురాలు సుమా ఆతల్లి, ఎవతె గరుత్మంతుడిముఖంలో పడినవాడైనా అక్షతశరీరుడైన పుత్రుడి ముఖం చూస్తుందో.

శంఖ.—అమ్మా, వాస్తవమే: కుమారుఁడు స్వస్థుఁడగునేని.

నాయ.—(వేదనను నటించుచు) హాహా, పరార్థసంపాదన రస పారవశ్యముచేత ఇంతసేపు నాకు తెలియక పోయినది. ఇప్పుడు మర్మచ్ఛేదకములై వేదనలు నన్ను బాధించుచున్నవి.

[మరణావస్థను నటించును.

జీమూ.—(సంభ్రమముతో) హా వత్సా, ఏమి ఇట్లు చేయుచున్నావు ?

వృద్ధ.—హా ఏమి ఈలాగు అంటున్నాడు. (రొమ్ము బాదుకొనుచు) కాపరయ్యా కావరయ్యా ఇదుగో నాకొమారుడు జీవం విడుస్తున్నాడు.

మలయ.—హా ఆర్యపుత్ర ! వదలిపోయేవానిలాగ ఉన్నావు.

నాయ.—(అంజలి చేర్పఁగోరుచు) శంఖచూడ, నా చేతులను కలియఁబట్టుము.

శంఖ.—(అట్లు చేయుచు) కట్టా, లోకము చీఁకటిదైపోయినది.

నాయ.—(సగము కన్నుదెఱచి తండ్రిని తల్లిని చూచుచు) నాయనా, అమ్మా ఇదే నా యంత్యనమస్కారము.

వసం. ఇయ్యంగముల్ సరి! వహింపవు చేతనఁ హా!
అయ్యోఁ గటా శ్రుతు లనక్షరధారకంబుల్!
అయ్యయ్యొ యుద్ధవిడి నక్షులు మూఁత లాయెఁ!
అయ్యా, వసంబెడలెఁ బ్రాణము లేచె నేఁగఁ. ౧౦౧
పోనీ, 'ఏపుణ్యము నార్జించితినో'

[ఇత్యాది చదివి పడిపోవును.

వృద్ధ.—హా పుత్ర! హావత్స! హా గురుజనవత్సల! ఎక్కడున్నావు? నాకు ఉత్తరం చెప్పు.

జీమూ.—హా వత్స! జీమూతవాహన! హా ప్రణయిజనవల్లభ! హా సర్వగుణనిధీ! ఎక్కడ నున్నావు? నాకు ఉత్తర మిమ్ము. (చేయెత్తి) అయ్యో కటకటా!

శిఖ. నిరాధారం బయ్యె న్వినయ, మిఁ కెట స్థిరత చనుఁ?
విరామం బొందె న్దానము, క్షమ యిఁ కేవెంట నొదుగుఁ?
బరాస్తం బయ్యె న్సత్యము, కృప యెట న్బ్రాకు? జగముఁ
హరా! శూన్యం బీ వో తనయ, గన లోకాంతరరతిఁ?

మలయ.—హా ఆర్యపుత్ర, ఏలాగు వదిలిపోయినావు? అతిక్రూరురాలా మలయవతీ, నీ వింకా ఏమి చూడవలిసిఉన్నది. ఇంతకాలం బ్రతికినావుగదా!

శంఖ.—హా కుమార, ప్రాణములకంటెను ప్రియమయిన యీజనుని వదలి ఎట్లు పోవుచున్నావు ? కనుక అవశ్యముగా నిన్ను శంఖచూడుఁడు వెంబడింపక మానఁడు.

గరుడుఁడు.—కటకటా ! ఈమహాత్ముఁడు మృతింపనే మృతించినాఁడు. ఇఁకను ఏమి చేయుదును ?

వృద్ధ.—(కన్నీళ్లతో ఊర్ధ్వము చూచి) ఓ వేల్పులార, లోకపాలకులార, ఏలాగైనా అమృతమైనా పైన చిలికి నా పుత్రుణ్ణి బ్రతికించరయ్యా.

గరుడుఁడు.—అమృతకీర్తనచే సమయమునకు చక్కఁగా జ్ఞాపకమయినది. అపకీర్తి పోయినది, పోయి దేవేంద్రుని ప్రార్థించి అతఁడుకురియించు నమృతవర్షముచేత జీమూతవాహనుని మాత్రమే గాక పూర్వభక్షితనులై అస్థిశేషములై పడియున్న నాగపతులను కూడ బ్రదికించెదను. అతఁడు గనుక ఇయ్యకొపోయెనా :

ఉ. రెక్కలధాటి వారినిధి రిక్తముఁ జేసి జవాశుగేరణన్
దృక్కుల నక్కలందఱను దీలుగ నేర్చి, కృశానునార్పి, యీ
ముక్కున నింద్రువజ్రమును ముగ్గుగఁ గొట్టి, సురాళిఁగిట్టినేఁ
గ్రక్కునఁ గ్రుమ్మరించెద నఖండసుధారసకుంభవర్షమున్.

కనుక నేను ఇదిగో పోయినాఁడను.

[అని ఆటోపముతో పరిక్రమించి నిష్క్రమించును.

జీమూ.—వత్స శంఖచూడ, ఇఁక నేల ఆలస్యము ? కట్టెలను తెచ్చి నా కుమారునికి చిత పేర్పుము. అందులో పడి మేమును వానితో కూడనే పోయెదము.

వృద్ధ.—పుత్ర శంఖచూడా, శీఘ్రంగా పేర్చు. నీయన్న మేము లేక దుఃఖపడుతూ ఉంటాడు.

శంఖ.—(కన్నీళ్లతో) గురువులయాజ్ఞ. నేను మీకు ముందే సుమా. (లేచి చితను పేర్చి) బాబూ, అమ్మా, చిత సిద్ధముగా నున్నది.

జీమూ.—దేవి. ఇఁక నేల యేడ్పు? లే ఇఁక చిత యెక్కుదము. [అందఱును లేతురు.

మలయ.—(అంజలి చేర్చి ఊర్ధ్వము చూచుచు) భగవతీ గౌరీ, విద్యాధర చక్రవర్తి నీకు భర్త అగునని వరమిచ్చినావు. అయినా నాదౌర్భాగ్యంవల్ల నీమాటకూడా మాయ అయిపోయింది గదా.

[అంతట సంభ్రమమున గౌరి ప్రవేశించును.]

గౌరి.—మహారాజ, జీమూతకేతూ, వలదు, వలదు, సాహసము వలదు.

జీమూ.—ఆహా! ఏమి! అమోఘదర్శన గౌరి!

గౌరి.—(మలయవతిని ఉద్దేశించి) వత్సా, నామాట మాయ యెట్లౌ అగును? (నాయకుని దరిసి కమండలుజలమును అతని మీఁద చిలుకరించి)

ఆ. ఆత్మజీవితంబు నర్పించి యేనియుఁ
జగములకు హితంబు సలుపునిన్ను
శిశువ మెచ్చుకొంటి జీమూతవాహన
బ్రదుకవయ్య లేచి భద్రముగను. ౧౦౪

[నాయకుఁడు లేచును.

జీమూ.—(హర్షముతో) దేవీ, భళీ నీపుణ్యము పండి నదిలే, మననాయన బ్రదికినాఁడు.

వృద్ధ.—భగవతియొక్క ప్రసాదముచేత.

నాయ.—(గౌరిని చూచి అంజలి చేర్చి) ఓహో ఏమి! అమోఘదర్శన భగవతి!

క. వరియించువరము లెల్లను
గరుణించెడుతల్లి, ప్రణతగణములబాముల్
హరియించుగౌరి, విద్యా
ధరవందిత దేవి! నీపదముల కెఱఁగెదన్. ౧౦౫

[అని గౌరి పాదములలో పడును. అందఱు ఊర్ధ్వము చూతురు.

జీమూ.—ఏమి! ఇది ఎట్లు గలిగినది? మబ్బులేనివాన! భగవతీ, ఇదేమి?

గౌరి.—రాజా! జీమూతకేతూ, జీమూతవాహనుని బ్రదికించుటకును, అస్థిశేషులైన యీనాగపతులను బ్రదికించుటకును, పశ్చాత్తప్తుఁడైన పక్షిరాజు దేవలోకమునుండి ఈ యమృతమవర్షమును కురియించినాఁడు, (వ్రేలితో నిర్దేశించి) ఏమి నీవు చూడలేదా?

ఉ. కవ్వుచు శంఖచూడు, బిగి
కౌఁగిటఁగ్రుచ్చుచు, ముద్దుఁగొంచుఁ, బె
న్దవ్వు శిరోమణుల్ వెలుఁగ,
ధాత్రి సుధారసలిప్సనాకుచున్,

రివ్వునఁ జందనాచలస
రిత్తతియో యన వక్రగాములై,
యివ్వే కుమారు మ్రొక్కుచు, ఫ
ణీంద్రము లంబుధిలోనఁ జొచ్చెడున్. ౧౦౬

(నాయకు నుద్దేశించి) వత్స, జీమూతవాహన. నీవు ప్రాణదానమునకు మాత్రమా పాత్రమవు? ఇదిగో నీకు ఇంకొక ప్రసాదము.

శా. శ్రీవెల్గన్ సృజియించి రత్నఘటులన్ గ్రీడన్మరాళీచల
త్సౌవర్ణాంబుజరేణుపంకిలమహా స్సంభావితాంభంబులన్
వావృత్తాభిషవంబు సర్వజగతీ వంద్యంబుగాఁ జేసి నే
నే విద్యాధరచక్రవర్తిగ నినున్నేమించితిన్ బ్రీతితోన్.

మఱియు,

శా. నీమ్రోలన్ జన నాత్మదీధితిసదానీరాజితాత్మస్థిత
శ్రీమాన్యంబగుమండలాగ్రమును నీ శ్వేతంపు జౌదంతియున్
శ్యామంబౌహారిరాజము న్మలయయన్వ్యాః శ్రేయసంబైనయీ
నామాణిక్యచతుష్టయంబుఁ గొనరా నాచక్రవర్తీశ్వరా. ౧౦౭

మఱియు, చూడు వీరుగో శరత్కాలచంద్రునివలె నిర్మలమైన వీచోపులుచేత ధరించి, ఆభరణమణికిరణములచేత ఇంద్రచాపరచనలను చేయుచు, భక్తిచే పూర్వకాయములను వంచి వంగివంగి నీకు నమస్కరించుచున్నారు మతంగహాతకాదివిద్యాధరపతులు. నీకు ఇంకను ఏమి ప్రియము చేయవలయునో చెప్పుము.

నాయ.—ఇంతకన్నను ప్రియముండునా !

ప్రగ్ధ. రక్షా ప్తి న్నంఖచూడో రగుఁ డలఁరె బత
ద్రాజు సన్మార్గుఁ డయ్యెన్,
భక్షింపంబడ్డయాసర్పపతులు మరలం
బ్రాణముం బొంది, రే ని
ట్లక్షీణాసుండఁగా నవ్యసులు గురువులై,
రైతి నేఁ జక్రవ ర్తిన్,
సాక్షాత్తా దేవిఁగంటి; న్నకలము ప్రియ మా
శాస్యమింకున్నె యెందున్ ! ౧౦౯

అయినను ఇది యగునుగాక భరతవాక్యము.

శా. వృష్టి న్హాలుష్టశిఖండితాండవముగా వేళ న్ఘను ల్సేయుచున్
స్పష్టశ్రీ నొనరింత్రుగాపుత హారిత్సస్యోత్తరీయన్ క్షితిన్,
బుష్టోదారత సంగ్రహించి సుకృతంబు న్సేయ మొప్పన్జను
ల్దుష్టిం గేరెడుఁగాత బాంధవసుహృద్గోష్ఠీవినోదంబులన్.

[అందఱు నిష్క్రమింతురు.

నాగానందనాటకము

సమాప్తము.

---

6.—ఓలు తెగగొంచు=వింటిని ఆకర్షించుచు, ఢక్కక్=మృదంగమును, తత్=మారునియొక్క, జంకెనలు=బెదరింపులు, లేనగవు=లేఁతనవ్వు, తెలచుచున్=నమస్కరించుచు; ధ్యాయిన్=ధ్యానము చేయువానిని-సమాధినిష్ఠుని, యమిని=యమములుగల వానిని - యతిని. 10. జనకుని.—ధృతి=ఆనందము, రాజకము = రాజసమూహము, తత్ ఈప్సిత భుక్తి అవశిష్టభుక్తికిన్ = తండ్రికి కావలసినది ఆయన యనుభవించినపిమ్మట మిగిలినదాని ననుభవించుటకు, వనటయ=దుఃఖమే, ఆత్మ పితృ వర్జికి=తన తల్లి దండ్రులను వదలువానికి, 11. నాయ.—నా సరి=నాకు సమానులను, పాదపరాజము=వృక్షశ్రేష్ఠము. 13. ఘనము.—గండమున్=చెక్కిలిని, అబ్ధి వీచి కర తాడనచేన్=సముద్రముయొక్క యలలనుహస్తములయొక్క దెబ్బలచేత, అనయము=అత్యంతము, కందు=ఎఱ్ఱబాఱుచున్న, ఆత్మకున్=మనస్సునకు; ఈపద్యమందు నోటరు లెవరేని చెక్కిలి గీటగా కన్నీళ్లు కార్చుచు, మఱి యెవ్వరయిన ముద్దునకు చేతితో చిన్నదెబ్బ కొట్టఁగా నోరు తెఱచి ఏడ్చుచు, ఒకశిశువు తనచెంతనున్న తనయక్క తల్లి మొదలయినవారి కాళ్లదగ్గఱకు ప్రాఁకఁగా వారియుత్సాహమందు వారు తన్ను చూడక సంచరించుటవలన వారికాలిపారాణి తగులుటచేత నెఱ్ఱనైన తనలావణ్యమయాంగములతో ఎట్లుండునో అట్లు మలయపర్వత మున్నదని తా. 14. తరు.— జీర్ణ కరకా అంశ వ్రాతములు=పగిలిన కమండలువులయొక్క ముక్కల సమూహములు, వటువుల్=బ్రహ్మచారులు, ముంజ ఆవళి మేఖలల్=ముంజి

గడ్డి యొక్క సమూహము యొక్క మొలత్రాళ్ళు, అమృత వాణిఁ = అమృతమధురమైన వాక్కుచేత, అళుల.—తొలి మూడుపాదములలో చెట్లు కర్త; 15. అళుల=తుమ్మెదలయొక్క, గీతిఁ=గానముచేత స్వాగతంబుఁ = కుశలప్రశ్నను, ఫలభరనత మౌళిఁ=పండ్ల బరువుచే వంగినయగ్రములచేత, జోహారు=నమస్కారము, చెలి = ఓమిత్రమా, సపర్యఁ = పూజను ; స్థాన.— సమతా తార మంద్ర వ్యవస్థల్=సమస్వరము ఉచ్చైస్స్వరము అధఃస్వము—వీనియొక్క భేదములు, స్ఫుటంబై=స్పష్టముగా, స్వాన శ్రీమత్ విపంచీ స్వరమునఁ=నాద గుంభన కలదైన వీణ యొక్క ధ్వనియందు, ఆళినీ ఝంకృతింబోలెఁ=తుమ్మెదల ఝంకారమునందుబలె, చేరఁ=(వక్ష్యమాణమయినగానము) కలసి పోఁగా, కానఁ=అడవిలో, మేఁ=దేహము, మాయఁ=నిలిచి పోఁగా, మృగంబుల్=లేళ్లు, విశద పదమధు స్ఫీతిఁ గీతిఁ ఆలించున్=స్పష్టమయిన తేనెవంటి పదముల యొక్క వ్యాప్తికలదైన (విశద అనునది స్ఫీతికి విశేషణము) సంగీతమును వినుచున్నవి, కాకలి యనఁగా మధురమైన సూక్ష్మనాదము; 16. కోరరానిది = నాయోగ్యతకుమీఱినది, కేరఁగాఁ=ఉత్సహింపఁగా. దరి = గట్టు, నీరజ ఉదర భూరజంబునఁ = కమలముయొక్క కడుపున పుట్టిన పుప్పొడియందు, సొరు = అందము, చెన్నారు మేగలగౌరి = ఎవరిదేహమునకు ఒప్పుచున్నదో ఆగౌరి, రతిఁ=భక్తిని—పూజను. 17. ప్రాపై.—ప్రాపు ఐ=పోషకములై— రసమును పోషించునవి అయి, వ్యంజనధాతువుల్ = గానము

నకు స్పష్టతను కలుగఁజేయు ప్రకారములు, వ్యక్తి=స్పష్టతను. లయ = కాలక్రియాసామ్యము, యతులు=నిలువుదలలు, తత్త్వము = విలంబితమను వాద్య ప్రకారవిశేషము. 18. దేవ,— వేగన్నులు=వేయి కన్నులును, గ్లావర్జంబు = చంద్రహీనము, బలిలోకంబు=పాతాళము, 19. స్వస్తి=క్షేమము, వరదానము= వరునియొక్క దానము – వరముయొక్క దానము అని శ్లేష. ఆప వారించి=కప్పుకొని పెట్టి. 20. బిస—బిసరుహ ఆయత వీక్షణ = కమలములవలె విశాలమైన నేత్రములు గలదానా, విసివెను= బడలెను, శ్వసిత కంపిత సాంద్రఘనస్తనీ = నిట్టూర్పులచేత వణఁకుచున్న క్రిక్కిఱిసియున్న దిట్టమైన స్తనములుగలదానా, వేఁచెదు = వేఁచెదవు – ఆయాసపెట్టెదవు. 21. కులపతులు —పదివేలమంది మునులకు అన్నవస్త్రము లిచ్చి అధ్యాపన చేయు బ్రహ్మర్షికి కులపతి యని పేరు.—బహువచనము పూజార్థకము, సవనము=పూజ,(స్నానము). 22. శ్రీవీవక్.—వీవక్=వ్యాపించు నట్లుగా, ఉష్ణీషంబు = కిరీటము (పాగయు), ఊర్ణా ఆవర్త అంకము = ఊర్ణ యను (కనుబొమ్మలనడిమి సుడికి ఊర్ణయని పేరు) నలంకారముకలది, హర్యక్షము=సింహము, విభ్రాజి=ప్రకాశించునది. 23. జఘన ఆభోగ=నితంబవైశాల్యముయొక్క. 24. గాసిన్:—గాసిక్=తాపకృతమయినయాయాసమును, సైఁపక= సహింపక, ఘృష్ట చందన రస ఓఘ శ్వేత గండ అద్రి=ఒరయఁ బడిన చందనపుఁ జాలయొక్క ధారచేత తెల్లనైన కొండల వంటి కపోలములు గలది, ఆసక్త శ్రుతి తాళవృంత పవమాన

ఆవీజ్యమాన ఆస్యము = చేరినచెవులనెడు విసనకఱ్ఱలయొక్క వాయువుచేత అంతటను వీవఁబడుచున్న మొగముగలది, నాసా ప్రోక్షిత శీకరంపు జడి వానఁ = తుండముచేత విడువఁబడిన తుంపురుల దట్టపు వర్షమును, వాసింబాసిన=పసి చెడిన, వాడు= వాడి పోవుచున్న, సల్లకము = అందుగుచెట్టు. 25. భర్తృ దారిక.—భర్తృ=ప్రభువుయొక్క దారిక = కొమారిత, అట్లే భర్తృదారకుఁడు = ప్రభు పుత్త్రుఁడు. 30, సలుపనె.—చంద్రికా ధవళ శర్వరులన్=వెన్నెలచేత తెల్లని (వైన) రాత్రులను, తొగ తావిఁ = కలువయొక్కపరిమళమును. నిశా ఆస్య సమీరణంబు లోన్ = రాత్రి తొలిజాముయొక్క వాయువునందు. 34. సీమోము.—తామరస అరాతి మణి వితర్ది = కమల శత్రు మణి (చంద్రకాంతమణి) యరఁగు, కొమరు=సౌందర్యము; 35. పరి పూర్ణ.—పరి...రముఁ-పరిపూర్ణ = నిండిన, బింబ=మండలము యొక్క-శోభా=కాంతిని, ధరముఁ=ధరించినదియు (చంద్రరేఖా పరమయిన యర్థము); పరిపూర్ణ=నిండిన, బింబశోభ = దొండ పండుయొక్క శోభగలదైన, అధరముఁ=అధరోష్ఠముగలదియు (ముఖపరమయిన యర్థము), దయిత మొగముదివి=ప్రియురాలి ముఖమునకు చెందినది ఐ, పరగు=ఒప్పునట్టి (రేఖకు విశేషణము) నెల=చంద్రుఁడు. 36. ఆవిద్యా.—వంశమణి-వంశ=వంశమనువెదురు యొక్క—మణి - ముత్యమయినవాఁడు, ధీ విక్రాంతి వినీతి రూప ఘనుఁడుఁ = బుద్ధిపరాక్రమ వినయ సౌందర్యములచేత గొప్ప వాఁడును, దీప్త ఆదృతిఁ = ప్రకాసించుచున్న ఆసక్తితో,

అ మ్మేటికిన్=అట్టి మహానుభావుఁడైన (జీమూత వాహనునికి).
43. బుక్కా.—బుక్కావానన్ = బుక్కావర్షముచేత - విస్తారము ఎల్లయెడల బుక్కాచల్లుటచేత, సురాద్రి స్ఫురణము= మేరుపర్వతముయొక్క కాంతిని - మేరువు = బంగారుకొండ - బుక్కాచేత మలయపర్వతము అంతయు బంగారమువలె ఆయెనని తాత్పర్యము. సంవాది అరుణ మణి రణత్ హంసక స్వానస క్తిన్ ఆ కాంతా ఉద్గీతిన్=లయసరిపడుచున్న ఎఱ్ఱని మణులు గల ఘుణిల్లని శబ్దించుచున్న పాదకటకములయొక్క ధ్వనితో కూడినదైన యా స్త్రీలయొక్క ఉచ్చైర్గానముచేత; ఎఱ్ఱని మణులు ధరించుట ఉత్సవానుగుణము; 'సంవాది' స్వానవిశేషణము; 'ఆ' ఉద్గీతికి విశేషణము; స్నపనకము=స్నానసమయము.
47. పితామహుఁడు=బ్రహ్మదేవుఁడు. 51. ఏను.—వామతనె = కుటిలతచేతనే, నవ ఊఢ = పెండ్లికూఁతురు, నవ (క్రొత్త) ఊఢ (వివాహముచేయఁబడిన స్త్రీ). 52. మానన్.—భాను ఊష్మ అతిగ చంద్రికా అభిధమహత్ పంచ అగ్ని తప్తుండను = సూర్యునియొక్క వేఁడిమిని అతిక్రమించెడు వెన్నెలయను పేరుగల గొప్ప అయిదు అగ్నులచేత కాల్పఁబడిన వాఁడను.
53. గాసిన్.—ఉరోజ=కుచములయొక్క, నితంబము=పిఱుఁదు, ఊరువులన్=తొడలను, కాంచి=మొలత్రాడు, ఒండు = ఒకటి, సైరింపద = సహింపనే సహింపదు, కైసేతల్...నంగములె = నీయంగకములే అలంకారములు. 58. క్షీర.—శ్రీ = శోభాయుక్తములైన, క్షీర స్రుత్ చందన ఆలీ శిశిరిత తలముల్ = పాలను స్రవించునట్టి గంధపుఁజెట్ల సమూహముచేత చలువ

చేయఁబడిన అధఃప్రదేశములు కలవి, తారధ్వనికిన్=ఉచ్చైశ్శబ్ద మునకు, తాండవంబు=ఉద్ధత నాట్యము, వారిప్రవాహంబు=నీటి ప్రవాహము, పతత్ పౌష్ప ధూళీ వృతంబు=పడుచున్న పుష్ప సంబంధమైన పరాగముచే కప్పఁబడినది, భూరుహ ఆవాల పంక్తికిన్=చెట్లపాదుల వరుసను, క్షుద్ర కుల్యల్ = చిన్న కాలు వలు, పూరించున్ = నిండించును; రెండవపాదమందు ధారాజల యంత్రగృహధ్వని మేఘగర్జితమనిభ్రమించి నెమలి ఆడసాగెను. అని యభిప్రాయము. 54. కల.—కల=మధురమైన, తీవమాడు పులు=తీఁగ మేడలు, పుష్పధూళులన్=పుప్పొడులచేతను, పిష్టాత కవిభ్రమంబు=బుక్కాయొక్క విలాసము, గండు=మగడి, ఏవలనం జూచినన్=ఎల్లయెడలను, పర్యాప్తిమైన్ = తృప్తితో-తృప్తిగా; ఆపానమహంబు = కలసిత్రాగుటయొక్క. యుత్సవమును. కల యన్.—కల్పస్రక్ ఆకల్పముల్=కల్పవృక్షముయొక్క పూదండ లనెడి యాభరణములను, వెలి ఫుట్టంబులు = తెల్లవస్త్రములు, భూషణ అబ్జమణి రుక్ విచ్ఛిత్తిన్ = ఆభరణములయొక్క పద్మ రాగమణులయొక్క కాంతియొక్క సొంపుచేతను, కలపువి=గుమి గూడి, గండూష=పుక్కిలింతయొక్క, పేరుఎలమిన్=గొప్పసంతో షముతో, కంటె=కంటివె. 55. మానుగ=చక్కఁగా, సుభ్రూల తము = మంచిబొమలనెడు తీఁగలుగలది. భానవత్ అరుణ అధర ఓష్ఠ పల్లవము=ప్రకాశముగల ఎఱ్ఱని క్రింది పెదవియను చిగురు గలది, నందనము = సంతోషపెట్టునది-నందనవనమును, లాఁతి = నందనమని ప్రసిద్ధికెక్కిన యింద్రోద్యానము, కేవలారణ్యము= నందనమునుగాదు ఉద్యానమును గాదు, వర్ణించుట=పొగడుట

= రంగు వేయుట. 57 మగువ —స్మితపుష్పఉద్గమము=నవ్వనెడు పువ్వుయొక్క ఉత్పత్తి, అధర పల్లవ పుటముపై = అధరోష్ఠ మనెడు చిగురుయొక్క దొప్పపై, ఫలము = ప్రయోజనము అను పండు, పజ్జ = పార్శ్వమందు, నీస్మితమును చూచుటచేత నా కన్నుదోయి కృతార్థమాయెనని తాత్పర్యము. సూర్య.— జ్యోత్స్నిల్లి-కంది=ఎట్టఁబాఱి, రదనకిరణ కేసరములు=దంత కిరణము లనెడు కింజల్కములు, తామరసమయేని = కమలమే అయిన యెడల-అనఁగా తామరసమే కాఁబట్టి, మధుపము = తుమ్మెద. 59.రుద్ధ...రంబు-రుద్ధ బ్రధ్న ఉస్రతా=అడ్డగింపఁబడిన సూర్యుని యొక్క కిరణములుగలిగియుండుట, వర్షుక దిన మతి కృత్ = వర్షించుచున్న దినముయొక్క (దినమనెడు) బుద్ధిని (భ్రమను) చేయుచున్న, రోదసీ శ్యామతా = భూమ్యాకాశములయొక్క నల్లఁదనము, సంబద్ధ=వానితోఁకట్టఁబడిన-అనఁగా అవి కలదైన, ద్యోయాన ఘట్టా మహిమకృత హరిత్ మధ్య మాన అంబరము ఐ=ఆకాశయానములయొక్క గుంపుయొక్క దైర్ఘ్యముచేత చేయఁబడిన దిక్కుల నడిమికొలతగలదైన యాకాశము కలది ఐ; సిద్ధానీకంబు=సిద్ధులదండు, భవత్ శిష్టి=నీయొక్క శాసనము చేత, యుద్ధ ఆదృత ఇష్టి = యుద్ధముకొఱకు గ్రహింపఁబడిన కోరికతో, (ఇదిగో), సంప్రస్థితము=చక్కఁగా బయలువెడలినది (నిశ్చయార్థమందు భూతార్థక ప్రయోగము), ఇద్ధ అరి నాశ ఆచిర దర కరద స్ఫీత రాజ్యంబు = ప్రకాశించుచున్న శత్రువు యొక్క సంహారముచేత స్వల్పకాలము భయముకలిగిన కప్ప మిచ్చువారు గలదైన ప్రవృద్ధమైన రాజ్యము, సిద్ధంబు = నిశ్చ

యముగా మరల లభించును; మా సైన్యములైన సిద్ధులు సూర్యరశ్మి అగపడక ముసురుదినమో యనుభ్రమ కలుగునట్లు ఆకాశమెల్ల ఆక్రమించుచున్న విమానములతో యుద్ధార్థమై యుత్సాహముతో బయలువెడలుదురు, వారిని నడపుటకు నీ యాజ్ఞను మాత్రమే ఎదురుచూచుచున్నాను, మేముదండెత్తి పోయి యుద్ధముచేసిన వెంటనే నీశత్రువు నశించుట నిశ్చయము, అంతట స్వల్పకాలము భయపడియున్న నీ సామంతరాజులు మరల నిన్నేకొలుతురు, నీ గొప్పరాజ్యమంతయు మరల నీకు స్వాధీనమగును.—అని తాత్పర్యము. ఏకాకిని = అసహాయుఁడను, కోశ ఆకృష్టఖడ్గ ఘృణిసంహతి కేసర ఆప్తి = ఒరనుండి దూయఁబడిన కత్తియొక్క జూలువంటి కిరణ సమూహము కలుగుటచేత, ఆఁకొన్న = ఆఁకలిగొన్న, హాళాహళిన్ = వేగముతో, ధాకన్ = శౌర్యవిజృంభణతో, మతంగహతకున్ = హతకుఁడైన (వ్యు. చంపఁబడిన, చచ్చిన, ఇదియొకతిట్టు) మతంగుఁడను గంధర్వుని, కూల్చినాఁడన్ = నిశ్చయముగా కూల్చెదను. 61. ప్రకట–ప్రకట ఆర్తి స్వాప ముద్రా వ్యపకలిత మహాపద్మకోశుండు = ప్రసిద్ధమగు పీడగలదైన (పీడను గలిగించునదైన) ముకుళనమను ముద్రించుటనుండి విడిపింపఁబడిన గొప్పతామరమొగ్గలు గలవాఁడు (అనఁగా తామరలను వికసిల్లజేసి సంతోషపెట్టినవాఁడు), సంస్థా వికల ఆశా పూరణ ఏకప్రియనిజకర సంప్రీణిత అశేష విశ్వుండు = నియమముచేత హీనమైన (అనఁగా ఇంతింత వఱకు అని యగపడని) దిక్కులను నిండించుటయే ముఖ్యమయిన ప్రియముగాఁగల తన కిరణములచేత మిక్కిలి సంతోషపెట్టఁబడిన సకల

లోకముగలవాఁడు, అకలంక ఆనంద సిద్ధ ఆళి అభినుతి పదము వి= నిర్దోషమైన సంతోషముగల సిద్ధుల సమూహముయొక్క (ఆళి యని పదవిభాగమగు నెడల ఆనందసిద్ధములు అనఁగా సిద్ధానందములైన మకరందాది లాభము చేత ప్రాప్తించిన సంతోషముగలవైన తుమ్మెదలయొక్క అని యర్థము) స్తుతికి విషయమై, అస్తమున్= అస్తపర్వతమును, పొందుచున్నాఁడు; మఱియొక యర్థము.— మహాపద్మకోశుండు = ...మహాపద్మమను నిధిగలవాఁడు (ఆనిధిని తెఱచి లోకులకు ఇచ్చినవాఁడు), ఆశా = కోరికలను, కర = చేతులచేత, సిద్ధ = సిద్ధకాములయొక్క—కోరికలు తీఱిన వారియొక్క, అస్తమున్ = అంతమును—మరణమును (అనఁగా మరణసమయ మందుఁగూడ మహోపకారములు చేయుచు ఆ కీర్తినిపొందుచునేపోవువాఁడు), మిత్రుఁడు = స్నిగ్ధుఁడు—లోకుల కందఱికి స్నేహితుఁడు. ఇందువలన "నీవు ప్రాణివధకై యత్నించుచున్నావు, ప్రాణ్యుపకారము చేసినం గీర్తికలదుగాని వధచేత కీర్తిలేదు, ఆయత్నము మాని ఉపకారప్రయత్నము చేయఁ దగును," అని మిత్రావసువునకు నాయకుఁడు అన్యాపదేశముగా ఉపదేశించుచున్నాఁడు. 62. భవ్య.—అంతఃపురవ్యవస్థన్ = రాజభార్యలయొక్క యేర్పాటును (పట్టణములలోపల కట్టుదిట్టములను అనియు అర్థము), భవ్యతన్ = చక్కఁగా; ప్రతిపదమునను = అడుగడుగునను, అనఁగా కాలెత్తి అడుగు పెట్టినప్పుడెల్ల (ఉద్యోగస్థులయొక్క అన్ని యధికారములయందును), సంస్ఖలితములను = కాలుజాఱుటలను (లంచములు పుచ్చుకొనుట రాజద్రవ్యమపహరించుట మొదలయినదోషములను),

దండనీతిః=చేతికఱ్ఱయొక్క నడపుటను అనఁగా చేతికఱ్ఱయొక్క తోడ్పాటును — (నేరముచేసినవారిని దండించునట్టిచట్టమును), ముదిమిః=ముసలితనమందు, నృపవృత్తము=రాజచర్య, మొనసెః=ప్రాప్తించెను. 64. పానుపు—పానుపు=పడక, శాద్వలంబు=పచ్చికబీడు, కలుబల్లలు=రాతిబల్లలు, నిర్ఝరోదకము=సెలయేళ్ల నీళ్లు, భక్తము = అన్నము, కందములు = దుంపలు, ఏణముల్=లేళ్లు, అయత్న సుఖమండితము = ప్రయత్నములేకయే కలుగునట్టి సౌఖ్యముచేత అలంకరింపఁబడినది, పర అర్థ విరహ ఆర్తి కదర్థితము = ఇతరుల ప్రయోజనము యొక్క అభావమువలని దుఃఖముచేత పీడింపఁబడినది, కటా = అయ్యో. జల.— జలకరులు = నీటియేనుఁగులు, ఊర్మి = అల, చయ్యనన్ = వెంటనే, కందర ఆస్య ఘటిత ప్రతిఘోషలు = గుహా ముఖములందు వ్యాపించు ప్రతిధ్వనులు, లలత్ అతిసంఖ్య శంఖ ధవళంబు=చలించుచున్న లెక్కలేని శంఖములచేత తెల్లనైన, 65. కవళించి.—కరిమకరులు=ఏనుఁగులును మొసళ్లును, చిక్కన్ వలుచు-చిక్కఁగా పరిమళించుచున్న, రత్నచ్ఛవితోన్ = పగడముల యొక్క కాంతితో. 67. ఆపన్నిధానము = విపత్తులకునిధి, అశుచిప్రాపకము = అశుచిని కలుగఁజేయునది, హేయము = త్యజింపఁదగినది. 72. మహా.—మహాత్ అహీంద్ర మస్తిష్క మాథ ఉల్బణ అసృక్ బృహత్ త్రోటి తీక్ష్ణుండు = గొప్పపాపరాజుల మెదడును చిందఱవందఱచేయుటచే స్పష్టమైన నెత్తుటిచేత పెద్దదయిన ముక్కుచే భయంకరమైనవాఁడు, అహిద్వేషుండు = పాముల శత్రువు - గరుత్మంతుఁడు, మల్లాడు =

పెనఁగొను, సహంబు = తేజస్సు, శుద్ధసత్త్వాత్ముఁడు = కేవలసత్త్వగుణముగలవాఁడు. 75. ప్రాంచత్ .—ఇందుః=ఈశ్మశానమందు, ప్రాంచత్ ... ఝుర జము—ప్రాంచత్ = వ్యాపించుచున్న - వ్యాబద్ధ = చాపఁబడిన - పక్ష ద్వయ = ఱెక్క జోడుయొక్క విధుతి = కదపుటగలవియు - మహత్ ధ్వాంత కృత్ = గొప్ప చీఁకటిని చేయునవియు నైన - గృధ్రసంసద్ = గద్దలయొక్క సభ (సమూహము) యొక్క - చంచూపుటీ = దొన్నెవంటి ముక్కుయొక్క - అగ్ర = కొనచేత - కృత్త చ్యుత = ఖండితములై జాఱిపడిన - పిశిత లవ = మాంసలేశములయొక్క - ఆస్వాద సంవృద్ధ గర్ధా పంచ ఆస్య = రుచి చూచుటయందు అతిశయించిన కోరికగల తెఱచిన నోళ్ల చేత - ఉద్వాంతశావ ప్రతతి పతన = క్రక్కఁబడిన (సర్ప) శవసమూహములయొక్క మొత్తములయొక్క రాలుటచేత - నిర్వాణ శబ్దాయమాన = ఆఱిపోయినవియు శబ్దించునవియునైన - అచంచత్ ప్రేతానల అసృక్ ఝుర జము - ప్రకాశింపని సొననిప్పులనుండియు రక్త ప్రవాహములనుండియు పుట్టిన, శ్వాసరుధ్ గంధము = ఊపిరిని ఆఁపునట్టి కంపు, పొలయుః = వీచుచున్నది; గద్దలు పాము లను కఱచుకొనిపోయి ఆకాశమునుండి పాపదేహమును కొంచెము కొఱికి ఆకొలుకుటచేత క్రిందరాలుచున్న లేశ మునుకఱచుకొనుటకై నోరు తెఱవగా నోటనున్న పాములు క్రింది చితాగ్నులలోను రక్తప్రవాహములలోను పడఁగా అగ్నులుఆఱిపోయెననియు రక్తప్రవాహములు శబ్దించెననియు ఆయుభయమునుండి బయలువెడలిన కమరుఁగంపు ఊపిరి

పలుపనీయకపోయె ననియు అర్థము; బహుజుగుప్సితస్థాన మిది యని భావము. 76. అహరహంబు=ప్రతిదినము, అహిచ్ఛటా ఆహారమునను=పాముల సమూహమే అను మేఁతచేత. (శివపర ముగా - సర్ప సమూహమను హారముచేత), వినాయకునకుఁ= పక్షులయొక్క రాజయిన గరుత్మంతునికి (శివపరముగా-వినాయ కున కనఁగా విఘ్నేశ్వరునికి), చంద్ర ధవళ కపాల అస్థిసాంద్ర ము=చంద్రునివలె తెల్లని పునుకలచేతను ఎముకలచేతను దట్టమైనది (శివపరముగా - శిరస్సునందలి చంద్రుఁడును తెల్లనివైన పునుకలు ఎముకలు వీనిచేత నిండినది, శర్వదేహంబు = శివుని యొక్క శరీరము, శ్మశానము=వల్లకాడు, 77. ప్రళయ.— ప్రళయ అభ్ర ఆభంబులై=ప్రళయకాలపు మేఘములయొక్క కాంతివంటి కాంతిగలవై, అదే పక్షతి ప్రాంత పంక్తుల్=అవిగో టెక్కలయొక్క అంచుల యొక్కవరుసలు, అభ్రము పొదివెఁ= ఆకాశమును ఆవరించెను. జలరాశిగాలిచేత, అంభంబు= సముద్రముయొక్క జలము, రంహః శ్వసనమునకుఁ=వేగముయొక్క భూక్షాళనంబు = భూమిని కడుగుటను, కల్ప భీఁ = ప్రళయ మేమో అను భయముచేత, సంధ్యాపయోద ఆళి=సంధ్యాకాలపు మేఘసమూహము. 78. తారా.—తారా ప్రాణ ఈశు మూర్తిఁ=నక్షత్రముల ప్రాణనాథునియొక్క అనఁగా చంద్రుని యొక్క బింబమును, దరిసి=సమీపించి, మత్ త్రస్తుఁ చక్రస్థుఁ శేషుఁ తలఁచి=నావలన భయపడినవానిని చుట్టగా నున్నవానిని (నాకు భయపడి చుట్టచుట్టుకొనియున్న) శేషుని జ్ఞప్తికి తెచ్చుకొని - నాకు భయపడి చుట్టచుట్టుకొనియున్న శేషుఁడు నేను

చంద్రుని చూడఁగానే తత్సాదృశ్యము చేత నాకు జ్ఞాపకము వచ్చె నని తాత్పర్యము, భీర్=భయము చేత; ద్రాఘ్యన్=ఈడ్వఁగా, దినమణి =సూర్యుఁడు, అనూ=అనూరుఁడు, సూర్యునిసారథి, బొరంజన్— బొరు=గొప్ప - అంజన్ = దాఁటుచేత, ప్రతిజనిన్=ప్రతిజన్మమం దును, ప్రాపించుతన్=సంభవించును గాక. 79. ఈవథ్యా.— అశ్మము=రాయి, పాతితున్=పడవేయఁబడినవానిని, అస్రము= రక్తము, అరుణ=ఎఱ్ఱని, మద్ భయ ప్రావిర్భావ విదీర్యమాణ హృదయ అస్ర వ్యాప్త కల్పున్=నావలని భయముయొక్క సంభ వము చేత పగులుచున్న గుండెయొక్క రక్తము చేత ఆవరింపఁబడిన వానితో సమానుఁడైన; నేను వచ్చి మీఁదఁబడుదు నను భయము చేత గుండె పగిలి ఆరక్తము దేహమంతటను క్రమ్ముకొనెనాఏమి అనునట్లున్న పామును అని తా. 80. ఆమో.—ఆమోద=పరిమళ ము చేత, చక్రవాళంబు=మండలంబు, ఘమాయించున్=మ్రోఁగు చున్నవి, ఊఁటాడి=కదలి, భూమన్=విస్తారముగా, సంవర్తక=ప్రళయ కాలముయొక్క. 81. ఫేననిభఁబు=నురుగువంటిది, భంగితము =సంజాత భంగము-ముడతలుకలది, క్షౌమ=దుకూల, ఓజప్పున్= సౌందర్యమును, పురణించున్=పోలును, గాదిలి=ప్రియురాలైన వేలానిభ=చెలియలికట్టవంటిది, లాలిత = లాలింపఁబడినది. 84. స్తోమంబు=మొత్తము; ఔత్పా...కృతిన్=ఉత్పాతసంబంధమైన మిక్కుటమైన విజృంభణగలిగిన గాలిచేత కదల్పఁబడి పడిన నక్షత్రముయొక్క యాకారమును. 86. సురుచిన్.—ముఁన్= మొదట, భూరిపాతన్ = విస్తారమయిన పడుటకలదానిని, సురు చిన్=మంచికాంతిగలదానిని (విస్తారముగా పడుటచేత మంచి

కాంతిగా అగపడుచున్నదానిని), పిఱుందన్=పిమ్మట. సు విరళ
పతిత స్థూలగోళన్=మిక్కిలి ఎడమెడముగా పడిన పెద్దబిందు
వులుఁగలదానిని, పెరరేపు ఔరాలన్=ఏరాలయందు చెదరునో
ఆరాలయందు, శీర్ణ అమిత తనుకణికన్=సడలిన అనేక సూక్ష్మ
లేశములుకలదానిని, ధాతులన్=గైరికాది ధాతువులందు, దర
లక్ష్యన్=కొంచెము కనఁబడుదానిని, సాంద్ర తరుశిఖలన్ = దట్ట
మయిన చెట్లయొక్క శిఖరములయందు, సంస్త్యాన నీలస్వరూ
పన్=చిక్కని నల్లనిరూపముగలదానిని, రక్తసరణిన్ = నెత్తురు
జాడను, ఎఱుకన్=తెలివితో. 89. సమ్రవాళివి = జొట్టును (శిర
మును) వంచినవాఁడవు-మదంఘ్రులకున్=నాపాదములకు. 91.
పాటీర అచలకూట కోటిన్=చందనపర్వతశిఖర అగ్రమందు,
ఖగ=పక్షి; అసృక్ ఝాటా అక్తంబు=రక్తముయొక్క సమూహ
ముచేత తడుపఁబడినది, త్రోటిన్=ముక్కును, దోనలన్=లోయలను,
బూది=బూడిద, పర్వాఁగాన్=కాల్పఁగా, ఉత్కర్తనము=పీఁకుట,
రోమాంచ = గగుర్పాటుచేత. 93. కుబుసంబు=పాముపొర, అం
డన్ = సమీపమందు, వ్యాజిహ్మ రత్న అర్చిన్ = మలినమయిన
శిరోరత్నముల కాంతిగలదైన. 96.—కాల అంత ఆక్రాంత
విశ్వగ్రసన రస లసత్ కాలజిహ్వా కరాళ జ్వాలా వాచాలన్ =
కాలముయొక్క ముగింపుచేత ఆక్రమింపబడిన ప్రపంచము
యొక్క (ప్రపంచమును) భక్షించుటయందైన ఆసక్తిచేత
చలించుచున్న రుద్రునినాలుకలవలె భయంకరమైన మంటలచేత
శబ్దించుచున్నదియు, సప్త అశ్వ కబళన విధా వర్ధమాన ప్రస
ర్పన్ = సప్తయను గుఱ్ఱముగల వానియొక్క (సూర్యునిని)

మ్రింగుటయొక్క ప్రకారమందు హెచ్చుచున్న వ్యాప్తిగలదియు, వ్యాలోల ఉత్పాత వాత ప్రసర పటిమ మత్ పక్ష సంధుక్షిత అర్చిః=మిక్కిలి చలించుచున్న అనిష్టసూచకమయిన వాయువుయొక్క వ్యాపించుటయొక్క పటుత్వమునంటి పటుత్వముగలదైన నాటెక్కలచేత వీవఁబడిన జ్వాలలుగలదియు, కల్ప దహన భయదః=ప్రళయకాలపు అగ్నివలె భయమును ఇచ్చునదియు (నైన), బాడబ ఆభోగనాభిః=బడబానలము యొక్క వైశాల్యముయొక్క మధ్యలో. 100. చేయకు.—ప్రాక్ కృతవధ అఘము=పూర్వము చేయఁబడిన హింసయొక్క పాపము, భర్జిత బీజకల్పము=కాల్పఁబడిన గింజ వంటిది, ఆయతిః=భవిష్యత్తునందు. సంసృతి కలః=సంసారము (జననమరణప్రవాహము) అనుస్వప్నమందు, సైకత ఆయతఫణా ఉచ్ఛ్రితి = ఇసుకతిన్నెలవలె విశాలమైన పడగలయొక్క ఔన్నత్యము, భోగచక్రము = సర్పదేహముయొక్క చుట్ట, భ్రమ = సుడియనెడు, సమాజము=సమూహము, ఆపాదము=పాదముల పర్యంతము, ఘనధ్వాంతముః=దట్టమయినచీఁకటిని, బాల ఆతప ఆంత్రైః=లేఁత యెండచేత అంతట ఎఱ్ఱగానుండుటచేత, చెంద్రంబు=సిందూరము, సేదః=ఆయాసమును, హారువునః=రమ్యతతో. 104. రెక్కల.—జవ ఆశుగ ఈరణః = వేగముగల గాలియొక్క ప్రేరణచేత. ఏర్చి=కాల్చి, బాముల్=దుఃఖములు, 106. దవ్వు=దూరము, లిప్సః=పొంద గోరికచేత, సరిత్=నదులయొక్క. 107 పంకిల=పంకముగల, మహస్=కాంతిచేత, వాసృత్త అభిషవంబు=కోరఁబడిన అభిషేకమును, నేమించితిః=నియమించితిని;

నీమ్రోలక్.—ఎదుట, ఆత్మదీధితి సదా నీరాజిత ఆత్తసిత శ్రీ మాన్యంబు=తనయొక్క కాంతిచేత ఎల్లప్పుడు నివాళింపఁబడినతన యందు ఉన్నలక్ష్మిచేత పూజ్యము, మండలాగ్రము కత్తియు, చౌదంతి=చతుర్దంతి,నాలుగు దంతములయేనుఁగు, హరిరాజము=శ్రేష్ఠమయినగుఱ్ఱము, మలయ=మలయవతి, శ్వః శ్రేయసంబు=మంళము, మాణిక్యచతుష్టయంబు = రత్నములయొక్క నాలుగింటి మొత్తము-అనఁగా నాలుగు మాణిక్యములను-అనఁగా నాలుగు ఉత్కృష్టపదార్థములను, 108. ఉరగము=పాము, తత్=పక్షుల యొక్క,అక్షీణ అసుండన్=క్షయింపని ప్రాణములు కలవాఁడను, అవ్యసులు—అ+వి+అసులు—వ్యసులు (పోయిన ప్రాణముగల వారు, ప్రాణముపోయినవారు) కానివారు అనఁగా బ్రదికియే యున్నవారు,గురువులు=తల్లిదండ్రులు, ఆశ్వాసము=కోరఁదగినది, ఘనుల్=మేఘులు, హృష్ట శిఖండి తాండవము కాన్ = సంతోషించిన నెమళ్లనృత్యము అగునట్లు, వేళన్ = కాలములో, వృష్టిన్ చేసి=వర్షమును కురియించి, క్షితిన్ = భూమిని, హరిత్ సస్య ఉత్తరీయరీన్=పచ్చనిపైరనెడు ఉత్తరీయముకలదానినిగాను సంస్పష్టశ్రీన్=స్పష్టమయిన భోగముగలదానినిగాను, ఒనరింత్రు గావుతన్=చేయుదురుగాక, పుష్ట ఉదారతక్ = పోషింపఁబడిన (పూర్ణమయిన) గొప్పతనముచేత, సుకృతంబుక్=పుణ్యమును.

---

# నాటక లక్షణము

మనము మామూలుగా నాటకములని రంగస్థలమందు ఆడునట్టివన్నియు 'నాటకము'లు గావు. వీనికి మనపూర్వులు వేలువేలుపేర్లుపెట్టి వాసివాని భేదములను జాగ్రత్తగా తెలుపుచుండిరి. ఎట్లనఁగా—రసవంతమైన వాక్యము కావ్యము. అట్టి వాక్యములచేత నొకకావ్యము రచియింపఁబడును. అది వచనమైనను పద్యమయమైనను కావ్యమే. ఈకావ్యములు గద్యపద్యములు కలసినవైనచో చంపువు లందురు. ఇవన్నియు చదివి విని ఆనందింపఁదగియుండుటచేత శ్రవ్యకావ్యములని చెప్పిరి. అట్లు కాక చూడఁదగినకావ్యము లున్నవి. అవే మనము నాటకములనునవి. నాటకములను చదువుటయు వినుటయు మాత్రమేగాక రంగమందు ఆడి చూచి సంతోషించుటవలన వీనిని దృశ్యములనిరి. ఇంకను స్పష్టముగా కొందఱు దృశ్యశ్రవ్యకావ్యమని చెప్పిరి.

దృశ్యకావ్యము అభినయింప బడును. రేడియోనాటికలు మనకావ్యములవలె కేవలశ్రవ్యములు. తోలుబొమ్మలాటలు మొదలైనవి వట్టి దృశ్యములు. 'టాకీ'వచ్చుటకు పూర్వముండిన చిత్రములు (Silent Pictures) కూడ దృశ్యమాత్రములే. నేటిచిత్రములును నాటకములునుదృశ్యశ్రవ్యములు.నాటకములనన్నిటిని మన పెద్దలు నాటకము లనలేదు; రూపకములు అనిరి. అనఁగా నటులు రామాదుల రూపములు (వేషములు) ధరించి అభినయించుటచేత రూపకములు. రూపకములు పదివిధములు. 1. నాటకము, 2 ప్రకరణము, 3 భాణము, 4 ప్రహసనము, 5 డిమము, 6 వ్యాయోగము 7 సమవకారము, 8 వీథి, 9 అంకము 10 ఈహామృగము. ఈరూపకములలో ప్రధానలక్షణములో నుండు భేదముతప్ప సామాన్యముగా రచనయంతయు నాటకము

వలెనే ఉండుటచేత మనవారు రూపకములన్నిటిని నాటకము లనియే చెప్పుచున్నారు. నాటకమునే అన్ని లక్షణములతోను కూడియుండి పదియంకములు గలదైనచో పండితులు మహానాటక మనిరి.

ఇవిగాక 'చిన్ననాటకములు' ఉపరూపకములు పదునెని మిది విధములు. ఇవి నాలుగంకములవి మొదలు ఏకాంకికలవఱకు గలవు. అవి—నాటికి, త్రోటకము, గోష్ఠి, సట్టకము, నాట్యరాస కము, ప్రస్థానకము, ఉల్లాప్యము, కావ్యము, ప్రేంఖణము, రాసకము, సంలాపకము, శ్రీగదితము, శిల్పకము, విలాసిక, దుర్మ ల్లిక, ప్రకరణిక, హల్లీసకము, భాణిక అని. రూపకములకును ఉపరూపకములకును వానివానికి చెప్పఁబడునట్టి విశేషము తప్ప మిగిలిన లక్షణమంతయు నాటకమునకు వలెనే.

అంకము—నాటకమున అంకములు అయిదు మొదలు పదివఱకు నుండును. నాటికలో అంకములు నాలుగు. అంక మనఁగా నాటక విభాగము; అంకములో నాయకుని చరిత్రము ప్రత్యక్షముగా చూపఁబడును. అది అనేకదినములు పట్టునదిగా నుండఁగూడదు. అంకముచివర పాత్రములన్నియు నిష్క్రమింప వలయును. అంకములో ఈ క్రిందిపనులు చేయఁగూడదు. "దూరమునుండి పిలుచుట, చంపుట, యుద్ధము, రాజ్యము దేశములోనగువానికి ఉపద్రవము, పెండ్లి, భోజనము, శాపము, ఉత్సర్జనము, మరణము, రతము, దంతక్షతము నఖక్షతము, ఇట్లు లజ్జాకరములగు నితరదృశ్యములు, శయనించుట, మోవి యానుట, (Kissing etc.,) నగరాదులను ముట్టడించుట, స్నాన మాడుట, మైపూఁత పూసికొనుట మొదలైనవి. అంకము మిక్కిలి దీర్ఘముగా నుండఁగూడదు.

నాటిక—ప్రియదర్శిక ఉపరూపకములలో మొదటిదైన నాటికలో చేరును. నాటికయందు కథ కల్పితము; స్త్రీపాత్రములు బహుళము; నాలుగంకములు. ప్రసిద్ధుఁడు ధీరలలితుఁడు, రాజు నాయకుఁడు. నాయిక అంతఃపుర సంబంధురాలు, సంగీత వ్యాపారమున నుండునది యొండె, నూతనానురాగ కన్య, మహీనాయక పుత్త్రి. ఈమెను గూడుటకు నాయకుఁడు పట్టపు దేవికి వెఱచియు జతనములు సేయును. దేవి జ్యేష్ఠురాలు, ప్రౌఢ, నరపతిపుత్త్రి, మాటిమాటికి మానము వహించునది. నాయికానాయకుల సంగమము దేవివశములో నుండును. ఇందు కైశికీవృత్తి విమర్శేతర సంధులుండును.

నాంది—నాటకమందు ముందుగా పూర్వరంగము, అటు పిమ్మట సభాపూజ, తర్వాత కవిని పేర్కొనుట, నాటకమును కూడ పేర్కొనుట, తర్వాత ప్రస్తావన. అందు నాట్యవస్తువు కంటె ముందుగా రఘ్నవిఘ్నోపశాంత్యర్థము నటులు కావించునట్టిది (పూజ) పూర్వరంగమనఁబడును, దీనియంగములలో ముఖ్యమైనది నాంది. ఈనాందియనునది నాటకాదుల యారంభమందు దేవబ్రాహ్మణ రాజప్రభృతులకు స్తుతిగా సామాజికాదులకు ఆశీర్వాచన రూపముగా 8, 12, 18, 22 పదములు గలదిగా రచింపఁబడును. ఇందు బిల్వ శంఖ చంద్ర కమల చక్రవాక కుముదాది శుభవస్తువాచకములును కావ్యార్థసూచనయు నుండవలయును. కొందఱ మతంబున పద నియమ కథాంశసూచనలు పాక్షికములు.

ప్రస్తావన – నటియేని విదూషకుఁడేని పారిపార్శ్వకుఁడేనియు సూత్రధారునితో స్వకార్యములంగూర్చి చిత్రవాక్యము

లతో బారంభించి నాట్యవస్తువును ప్రశంసించునట్టి సంభాషణ ఆముఖమనియు ప్రస్తావనయనియు పేర్కొనఁబడును.

వసన్తోత్సవము—నాటకమందు వివాహకథయైనచో వసంతమునేని గ్రీష్మము నేని ప్రస్తావించుట సంప్రదాయము.

నేపథ్యము–అనఁగా తెఱమఱుఁగున నటీనటులు వేషము దాల్చు చోటు.

విష్కంభము—అయినవియు కాఁబోవునవియునగు కథాంశములను సంగ్రహముగా తెలుపునది విష్కంభము, అంకమునకు పూర్వము నిబంధింపఁబడును. మధ్యపాత్రము చేతగాని, మధ్యపాత్రములచేతగాని ప్రయోగింపఁబడునది శుద్ధవిష్కంభము; నీచమధ్యపాత్రములచేత ప్రయోగింపఁబడునది మిశ్ర విష్కంభము.

విదూషకుఁడు నాయకునికి శృంగారసహాయుఁడు, బ్రాహ్మణుఁడు, కుసుమవసంతాది నామధేయుఁడు, క్రియా శరీర వేష భాషాదులచేత హాస్యముఁబుట్టించువాఁడు, జగడగొండి, తన పనిలో నేర్పరి.

కంచుకి—అంతఃపురమందుండు నధికారి, బ్రాహ్మణుఁడు, గుణవంతుఁడు,సర్వకార్యార్థకుశలుఁడు.

ప్రవేశకము–నీచపాత్రములచే నీచవాక్యములచే చేయఁబడును. రెండంకముల నడుమ వచ్చును. మిగిలిన విషయములలో విష్కంభమువలె.

భరతవాక్యము—భరతుఁడు, అనఁగా నటుఁడు చెప్పునట్టి వాక్యము మంగళము.

---

చంద్రికా ప్రెస్సు, మదరాసు.—23-8-1954.